సృజన

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

[త్రైమాసిక]

13

నవంబర్ 1969

నిర్వాహణ

'సాహితీ మిత్రులు'

రూపాయిన్నర.

ముఖ చిత్రం:

రాచకొండ విశ్వనాథశాస్త్రి
కొడవటిగంటి కుటుంబరావు.

చిత్రకారుడు: హనుమాన్ షాది.

ప్రతులకు, వివరాలకు:

1. వరవర రావు,
P. B. 67,
వరంగల్ - 2.

2. నవీన్,
6–3–117,
రామగిరి, నల్లగొండ.

ఈ సంచిక 150 పైసలు
సంవత్సర చందా నాలుగు రూపాయలు

# సృజన

నవంబరు 69 జనవరి 70

ఈ సంచికలో



## నాలుగేళ్ళ సృజన

సృజన నాలుగవ జన్మదినం జరుపుకుంటున్నది.

ఈ నాలుగేళ్ళలోను సృజన బలం పుంజుకొని పురోగమించింది.

ప్రయోగశీలత్వం, సృజనాత్మకత, ఆధునిక దృక్పథం పునాదులుగా సృజన ఈ నాలుగేళ్ళలోను 13 సంచికలుగా వెలువడింది.

ఈ నాలుగవ జన్మదిన సంచికను పూర్తిగా కథల సంచికగా వెలువరిస్తున్నాము.

ఆధునిక సాహిత్యంలో కథకున్న ప్రాముఖ్యాన్నిగూర్చి మేమిక్కడ విడమర్చి చెప్పాల్సిన పనిలేదు. కాని నేటి వ్యాపార పత్రికలు కథానిక స్థాయిని చాలా దిగజార్చివేశాయి. కథంటే కేవలం కాలక్షేపంకోసం ఒకసారి చదివి అవతల పారేసేదనో లేక రచయిత తన పగటి కలల్ని కథలుగా రాసితీర్చుకోవటానికనో లేక పాఠకుడి పగటికలల్ని సంతృప్తి పరచటానికోనన్న దృక్పథంతో ఈనాడు వ్యాపార పత్రికలు కథల్ని ప్రచురిస్తున్నాయి. కాని సమాజంలోని ఆర్థిక, రాజకీయ, సాంఘిక, మానసిక సమస్యల్ని వాస్తవికంగా చిత్రించే కథల్ని అవి తగినంతగా ప్రోత్సహించటంలేదు.

ఈ సంచికలో పన్నెండు కథల్ని అందిస్తున్నాము.

ఈ 12 కథల్లో ప్రతి కథలోను యేదో ఒక నిజమైన సమస్య వుంది, జీవితం వుంది, జీవితంలోని చేదునిజాలున్నాయి, జీవితాన్ని వివిధ కోణాల్లోంచి చిత్రించాలన్న తపనవుంది, పాఠకుణ్ణి జోకొట్టటం కాకుండా అతని మేధస్సుకు కొంచెం పదును పెట్టి పనికల్పించాలన్న ప్రయత్నంవుంది.

ఈ సంచిక ముఖచిత్రంగూర్చి రెండుమాటలు—కథల సంచిక కావటంవల్ల తెలుగు కథానికారంగంలో నిజమైన గొప్పతనాన్ని సాధించిన ఇద్దరు కథకుల చిత్రా లుండటం సముచితమని మేము భావించాము. లోపల ఈ ఇద్దరి కథకుల కథలులేకున్నా కనీసం వాళ్ల చిత్రాల్నిచూసైనా మా పాఠకులు సంతృప్తిపడతారని మా నమ్మకం. (కుటుంబరావుగారి కథలేకున్నా వారితో ఇంటర్వ్యూని వేయగల్గినందుకైనా ఎంతో సంతోషిస్తున్నాము.)

సృజన మూడవ జన్మదిన సంచిక వెలువడిన సందర్భంలో సృజన నాలుగవ జన్మదిన సంచికనుండైనా ద్వైమాసికంగా రావాలని మేమనుకున్నాము. కాని సృజనను ద్వైమాసికగా తీసుకురావాలన్న మా సంకల్పాన్ని యింకా కొంతకాలం వాయిదావేసి 'సృజన ప్రచురణల'ను చేపట్టాము. ఇప్పటికి రెండు పుస్తకాల్ని ప్రచురించాము. (1. వినడానికోకథ, 2. అంపశయ్య) త్వరలోనే మా మూడో ప్రచురణ (మాదీ మీ ఊరే) కూడా వెలువడుతుంది.

సృజనకు పాఠకుల అభిమానమనేపెట్టుబడితప్ప వేరేపెట్టుబడిలేదు. ఉధృతాభక్తిగా ఎంతోకొంత సాహిత్యసేవ చేద్దామన్న ఆ కాంక్ష తప్ప లాభాపేక్ష అసలేలేదు. మొదట్లో మా ఈ ప్రయత్నాన్ని చాలామంది అతిసాహసమనీ, తొలిసంచిక వచ్చాక మరిసంచిక వస్తుందా అనీ హెచ్చరించారు. కాని సృజన నిలిచింది. ఇందుకు కారణం మీరు—మా పాఠకులు. ఇన్నాళ్ళ మీ సహకారానికి, ఇక ముందు రాబోయే మీ సహకారానికి ఇవే మా హృదయపూర్వకమైన ధన్యవాదాలు.

— **సాహితీ మిత్రులు.**

'ఆలోచించడం
అంటే ఊకని దంచడం
కాదు, వ్యథల్ని చించడం
సుధల్ని పంచడం'

— శ్రీ శ్రీ

# పేరు లేని వాడు

—మరువాడ రాజేశ్వర రావు

ఇంగ్లీషు క్లాసు జరుగుతోంది. రామకృష్ణ ఎప్పట్లాగే మధ్యలో లేచి ఏవేవో ప్రశ్న లేస్తున్నాడు, లెక్చరరుగారు సమాధానాలు చెప్తున్నారు.

రామకృష్ణ ప్రశ్నలకి సమాధానం చెప్పడమంటే లెక్చరర్లకిష్టం.

"దొంగవెధవ. తెలివైనవాడ్ననుకొంటాడు". అనుకున్నాడు శేషు.

"తెలివైనవాడేకాని, అలాగ లేచి ప్రశ్నలడగాలా?.... అంతాగొప్ప! లెక్చరర్లకక్కూడా వాడంటే ఇష్టమే! తెలివైనవాడు కదాఅని.... నేనుకూడా వాడిలాగా ప్రశ్నలడగ్గలిగితే.... నేనూ తెలివైనవాడ్నైతే.... నన్నుగూడా లెక్చరర్లు మెచ్చుకుంటే!...

నాన్సెన్స్! ఇంతమందీ తెలివితక్కువ్వాళ్ళు, వాడొక్కడే తెలివైన వెధవాను? ఆదంతా అందరిముందూ చూపించేసుకోవాలి కామోసు! తన తెలివితేటలు తన దగ్గరే వుంచుకోకూడదూ? అబ్బే, అందరికీ చూపించెయ్యాలి. అందరూ వాడ్నిపొగిడేయాలి. అమ్మో, వాడికున్నంత గర్వం మరెవరికుంది? నాకూ యీ పాటి తెలివితేటలుంటే........!"

శేషుకి రామకృష్ణ తెలివితేటలంటే కోపం తనకి తెలివితేటలుంటే ఎంతో యిష్టం.... రామకృష్ణని నలుగురూ పొగిడితే.... ఈర్ష్య. తనని అందరూ పొగడాలని కోరిక.

రామకృష్ణన్నా, అతని తెలివితేటలన్నా అతనికి కోపం, ఈర్ష్య వుండడానికి మరో కారణం కూడా వుంది.

ఆ రోజు.... అతని తెలివితేటలే తన తెలివితక్కువ తనాన్ని బైటపెట్టేయి. అమ్మో, వాడి తెలివితేటల్నైనా భరించొచ్చుగాని, తన తెలితక్కువతనం నలుగురికీ తెలిసిపోతే భరించ శక్యమా?

కాని, భరించాల్సొచ్చిందా రోజు.
అంత అవమాన్నూ దిగమింగాల్సొచ్చిందా రోజు....

ఆ రోజు........?
కాలేజీ వార్షికోత్సవం.
అంతటా సందడి, సంతోషం....
నవ్వులు....రంగులు....పాటలు!
అమ్మాయిలు....అబ్బాయిలు
(అబ్బాయిల చూపులు, అమ్మాయిల చూపు !)
పెద్దలు .... కబుర్లు .... ప్రశంసలు........
నీటుగా డ్రస్సులు, తెలివైన మాటలు........
బహుమతి ప్రదానం!
రామకృష్ణకి డిబేటులో మొదటి బహుమతి!!
అతని కళ్ళలో గర్వం.
ముఖం నిండా సంతోషం.
ఠీవిగా, దర్పంగా నడక........
తెలివితేటల్ని గుప్పించే మాటలు!

"ఫస్టు రావడం మాటకేంగాని, 'షా' పుస్తకం 'మేన్ అండ్ సూపర మేన్' ఇచ్చినందుకు నాకెక్కువ సంతోషంగావుంది గురూ" అంటున్నాడు.

"అవును గురూ, బెర్నార్డ్ షా బాగా రాస్తాడు" అన్నాడు శేషు (తన వునికిని తెలుపుకునే యత్నంలో)

"నువ్వు చదివేవేమిటోయ్? ఏ పుస్తకాలు చదివేవ్?" అంటూ కుతూహలంగా అడిగేడు రామకృష్ణ.

"ఏవో పేర్లు సరిగా గుర్తులేవు గురూ..." అని తప్పించుకోబోయేడు శేషు.

"మేజర్ బార్బరా చదివేవేంటి?.... సెయింట్ జోన్...." అంటూ పుస్తకాల పేర్లు యేకరువు పెట్టబోయేడు రామకృష్ణ.

"ఆఁ! సరిగ్గా ఆ రెండు నవలలే గురూ! చాలా బాగున్నాయేఁ?" — రామకృష్ణ బాగుంటాయనేసి ఊరుకుంటాడనుకున్నాడు శేషు. కాని నవ్వుతున్నాడు.

రామకృష్ణా....
అతని చుట్టూ అందరూ నవ్వుతున్నారు.

తను అయోమయంగా చూస్తుంటే అంతా నవ్వుతున్నారు. అంతా నవ్వుతుంటే తనకి అయోమయంగా ఉంది.

"అహఁ, కాదు గురూ! అవి నవలలు కావు. పొ.... పొరపాటు.... అబ్బే! అవి నవలలేంటి! ఎవడేనా నవ్వుతాడు" అంటూ నవ్వబోయేడు శేషు.

అయినా నవ్వుతున్నారు.

ఇంకా, ఇంకా నవ్వుతున్నారు.

అందరికంటె ముందు నవ్వాపేసిన సీతాపతి సీరియస్‌గా ముఖంపెట్టి, పంటితో నవ్వాపుకుంటూ,

"షా పద్యాలు రాసేడు గురూ....నవలలంటావేంటి?" అన్నాడు.

"ఆఁ ఆఁ! అవునవును! అవి పద్యాలు....పద్యాలే. అవును. పద్యాలు....," జ్ఞాపకం వచ్చినట్టన్నాడు.

ఇంకా యెందుకో నవ్వుతున్నారంతా....
నిజానికిప్పింకా గట్టిగా నవ్వుతున్నారు,
నవ్వుతూ శేషుని ఏడిపిస్తున్నారు.
అతని పళ్ళు నవ్వుతున్నాయి.
కిర్కొడుస్తున్నాయి.
మనసు మండిపోతోంది,
వొళ్ళు తెలిపోతోంది
జేబులో చేతులు పెట్టుకుంటున్నాడు.
మెటికలు విరుస్తున్నాడు.
బుర్ర గోక్కుంటున్నాడు,

'నెర్వస్'గా ఉన్నట్టు ఎవరికీ తెలియగూడదని శతవిధాల ప్రయత్నం చేసేడు.

అంతటికీకారణం— రామకృష్ణ!
కాదు. అతని తెలివితేటలు....
అతని విజ్ఞానం!

అసలు 'షా' పద్యాలో, నవలలో యెందుకు రాయలేదు? అసలేం వ్రాసేడు, ఏవోరాసేడు సరే....

అదే ఈ రామూగాడికి ప్రైజుగా ఎందుకివ్వాలి? వాడికసలు డిబేటులో ప్రైజు రాకుండావుంటే బాగుండేది. వాడికసలు తెలివితేటల్లేకుండాఉంటే బాగుండేది. ఉంటే ఉన్నాయి కాని.... నా మీదెందుకు ప్రయోగించాలి?

వాడికి తెలుసు. అందరూ నవ్వుతారని.... తన తెలివితేటల బలం తో నా తెలివి తక్కువతనం మీద నవ్వుతారని!

అప్పుడు తన తెలివితేటలకి అందరూ గౌరవం చూపిస్తారని....
కుళ్ళు, గర్వం, పొగరు....?

అసలివన్నీ జరగడంలో తప్పు లేదు. తనకి 'షా' గురించి గాని, అతను రాసిన పుస్తకాల గురించిగాని తెలిసుంటే....!

తనగ్గాని అవతలివాడికంటే ఎక్కువ తెలివితేటలుంటే అవతలివాడి తెలివి తేటల్ని క్షమిస్తాడు. అవతలివాడికి తెలివితేటలుండనీ.... తనకంటే కొంచెం తక్కువగా!

* * * *

గంట గణ గణమంటూ అతన్ని ఆలోచనల్లోంచి లేపింది.
నిశ్శబ్దం ఒక్కసారిగా బ్రద్దలైంది.
'దా' మ్మని పేలింది టపాకాయ.
ఉలిక్కిపడ్డారంతా.

అదిరిపడ్డారు ఇంగ్లీషు లెక్చరరుగారు. గిర్రున బోర్డువైపు నుంచి క్లాసు వైపు తిరిగేరు.

కళ్ళజోడు వెనుక భయం కనిపిస్తోందా కళ్ళల్లో. విద్యార్థులెవ్వరూ కదలేదు. అంతా మౌనంగా, బుద్ధిగా ఎదుటికే చూస్తున్నారు.

పావుగంటసేపు విద్యార్థుల్నందర్నీ తిట్లతో దీవించి, మళ్ళా బోర్డువేపు తిరిగేరు లెక్చరరుగారు.

వెంటనే క్లాసులోనివాళ్ళందరి చూపులూ రమణారావువేపు తిరిగేయి. చిరు

నవ్వుల అభినందనలు ఆతన్ని చేసేయి.

చిరునవ్వుతోటే వాటిని స్వీకరించేడు.

రమణారావంటే ఆరడుగుల కండలుతిరిగిన అందగాడు. అతని కళ్ళలో ఎప్పుడూ చురుకుదనం, చిలిపితనం మెరుస్తుంటాయి.

అతను ఎవరికీ తెలియకుండా అల్లరిచేస్తాడు.

ఆడవాళ్ళని ఏడ్పిపిస్తాడు. అతనేడిపించినందుకు గర్వించని అమ్మాయిలేదు. అతనేడిపించిన అమ్మాయిలందరూ గౌరవిస్తారు.

అతనంటే లెక్చరర్లకి భయం.
అందుకే విద్యార్థులకి అతనంటే భక్తి, గౌరవం.
అతన్నెవరూ ఎదిరించలేరు.
ఎదిరించాలని కోరుకోరెవరూ!

అల్లరిలోను, ఆటల్లోను కూడా మొదటివాడు కావడం చేత అతని పేరు తెలియని మొద్దులు ఆ కాలేజీలో చాలా తక్కువ మంది.

అతన్తో స్నేహం చేసే అదృష్టంకోసం ఎప్పుడూ ఎదురు చూస్తుంటారు చాలా మంది.

"వెధవకి అదృష్టం ఉంది. లేకపోతే అల్లరిచేసే రౌడీ వెధవకి యింత పేరుండడం ఏఁవిటి?" అనుకున్నాడు శేషు.

"కాని వెధవ బాగుంటాడు. బాగా అల్లరిచేస్తాడు కూడాను.... ఆఁ అల్లరి చేస్తే గొప్పేఁవిటి? ఎవడేనా చేస్తాడు, నేనూ....చెయ్యగలనా?"

చెయ్యగలిగితే యెంత బావుంణ్ణేది.

వాడిలాగే తనకీ అంతా....

అయినా, ఆ వెధవ నలుగురూ తనని పొగడాలనే అలా అల్లరిచేస్తున్నాడు, అందరూ తనంటే భయపడాలనే...అందరూ తనని గౌరవించాలనే అలాచేస్తున్నాడు.
వెధవ గర్వం!

అయినా అదేఁవిటి చంటి పిల్లాళ్ళాగ.... 'నన్నుచూడమ్మా- నే నెంతబాగా అల్లరి చేస్తానో' అని చంటిపిల్లాడంటాడు. అయినా ఈ లెక్చరర్లకి బుద్ధిలేదు. వాడ్ని కాలేజీనుంచి డిస్మిస్ చేసేవొచ్చుగా. వాడంటే భయం!(నేనంటేకూడా వాళ్ళకి భయం ఉంటే బాగుణ్ను.)

ఏ వేఁనా సరే, వాడ్ని అంతగా పొగడ కూడదు. (వాళ్ళంతా వాడి బదులు నన్ను పొగిడితే బాగుండును!)

ఎలా పొగుడుతారు?

కుక్కలాగో పందిలాగో ఎలకలాగోఅరిస్తే?

కాదు కాదు!

పిల్లిలాగరుస్తే బాగుంటుంది! అని నిశ్చయించుకున్నాడు శేషు.

క్లాసంతా నిశ్శబ్దంగా ఉంది. అంతా శ్రద్ధగా పాఠం వింటున్నారు, రెండు చేతులు నోటికి దగ్గరగా పెట్టుకొని 'మ్యాఁవ్ఁ' మన్నాడు.

అంతే! ....

లెక్చరరు బూతులు తిట్టేస్తున్నాడు తనని.

అంతా తన వైపే చూస్తున్నారు. అంతా నవ్వుతున్నారు, ఆ నవ్వులకు అతని చెవులు హోరెత్తి పోయేయి. మెదళ్ళో సముద్రపోటు ప్రారంభమైంది. చలి జ్వరం వొచ్చిన వాళ్ళాగ వొణికిపోతున్నాడు. ఏడుస్తున్నాడు....

అదంతా అతని భయం వల్ల కలిగిన ఊహ.

క్లాసు మామూలుగానే జరుగుతోంది.

అతని అరుపు ఎవరికి వినపడలేదు. కనీసం పక్కవాడికి .... అతనికే వినపడలేదు.

అసలరవందే!

అరవకుండానే ఇంత జరిగిందతనిలో.

"ఛా, ఛా!" నేను పిరికివాన్ని. తెలివి తక్కువ వాడ్ని. ఎందుకూ పని కిరాను. నేనుత్త శేషునే. అందరిలాగే నా పేరూను.... అందరిలాంటి వాడ్నే నేనూను,

నాపేరు రామకృష్ణ గారి పేరులాంటిదికాదు. రమణారావుపేరు లాంటిదీ కాదు. నాకు ప్రత్యేకత ఏమీ లేదు. నాపేరుకి పేరు లేదు.

నేను భయపడ్డానికూడా భయపడతాను .... నేను 'జీవించడం'లేదు. 'బ్రతుకున్నా' నంతే!....యే పనీచెయ్యకుండా ఉండడంకూడా నాకు చేతకాదు.... నిశ్శబ్దం కూడా పలుకలేను....

నేనొక పెద్ద 'సున్నా' గాణ్ని.

అది కూడా కాదు నేను.... నేనెవరు? ఎవరు?.... ఎవరు?.... ఎవర్నేను?"

ఎంతో ఆవేదనతో అమాయకంగా తనని తాను ప్రశ్నించుకున్నాడు శేషు.

సమాధానం దొరక్క– నీరసంగా, నిరుత్సాహంగా కృంగిపోయేడు....

*　　　*　　　*　　　*

విశాఖపట్నం మెయిన్ రోడ్డుమీద శేషు అనే వ్యక్తినెవరూ పలకరించడం లేదు.... అతనూ ఎవర్నీ పలకరించడం లేదు.

అలా వెళ్ళిపోతున్నాడు ఏదో ఆలోచిస్తూ,

మెయిన్ రోడ్డంతా చాలా సందడిగా, హడావిడిగా ఉంది. మనుషులు, కార్లు బస్సులు, రిక్షాలు, సైకిళ్ళు వస్తూ పోతున్నాయి.

ఆ జీవసముద్రంలో ఒక కణంగా నడిచిపోతున్నాడు శేషు.... పరిసరాల్ని మరచిపోయి....ఆలోచనల్లో మునిగిపోయి....ఊహాలోకాల్లో తేలిపోతూ నడుస్తున్నాడు.

అతని ఎదురుగా ఓ ఆరేళ్ళ పాప....

ముద్దులు మూటకట్టే పాప!

రంగురంగుల గౌను, పరికిణీ

తెల్లగా, గుండ్రంగా, బొద్దుగా, వెన్నబిస్కెట్ లాగుంది పాప! ఆడుకుంటూ పాడుకుంటూ పోతోంది....

కార్లు....బస్సులు....సైకిళ్ళు....రిక్షాలు....గణగణ....బోంయ్....

'ఏంటిటీ? అప్పలాస్వామి....' ఎవరివో మాటలు

పాప ఎవరో ధనవంతులపిల్లలాగుంది. చాలాధనవంతుల పాప....

సినిమాహాలు.... ఎస్. బి. పి. కె. వద్ద్క్కా.... హాలు నిండినది.!..

బస్సులో వెళ్ళాడుతూ మనుషులు....

వాళ్ళింట్లో ఆ పాపంటే అంతులేని ప్రేమ. వాళ్ళ తల్లిదండ్రులకి లేక లేక ఒక్కతే ఒక కూతురు, ఆ యింటి దీపం....

ఆమెకోసం చెయ్యలేద్దేమీ లేదు.

"గణగణ, గణ....బాంయ్....అబ్బ! తోసుకుపోతున్నారు జనం...."

అప్పుడప్పుడు. అందాల పాప....

కార్లు....అమ్మో, కారు....

మహా వేగంతో వస్తోంది....అయ్యయ్యో. పాపమీదనే.... ఆలోచించడానికి వ్యవధిలేదు.

మెరుపులాగ రక్షించాడామెని శేషు!

ఆమెని ఆతనెత్తుకోడంవూ, కారుదూసుకుపోడంవూ ఒక్కసారే జరిగేయి.

ఒక్క తృటిలో ప్రమాదం తప్పిపోయింది.

ఊళ్ళోకల్లా ధనవంతులపాప బ్రతికిపోయింది.

అతని ధైర్యసాహసాలని జనంఅంతా మెచ్చుకుంటున్నారు, భుజాలమీద పాపనెక్కించుకున్నాడు శేషు. శేషుని భుజాలమీది కెక్కించుకున్నారు జనం.

ఆ పాపతల్లి, తండ్రీ తమ కృతజ్ఞత నెలా ప్రకటించాలో తెలియని అవస్థలో వున్నారు.

పదివేలు బహుమానం!

'వొద్దండి' అన్నాడు శేషు.

'ఓహో త్యాగమూర్తి! ధన్యజీవి!!' అంటున్నారు జనం.

'దయచేసి తీసుకోండి!'

తీసుకోండి—

తీసుకోండి, తీసుకోండి—

అంటూ కొన్నివేలగొంతుకల ప్రోత్సాహం, సవినయంగా పదివేలు తీసుకున్నాడు.

రాత్రి తొమ్మిది గంటలకి వార్తల్లో మొదటివార్త శేషు సాహసమే!

మర్నాడు న్యూసుపేపర్లో అతని ఫోటోతో సహా ప్రశంసలు ....విస్మయాన్ని వ్యక్తంచేస్తూ పొగడ్తలు!—

రెక్కపట్టుకులాగే దెవడో, కున్నకలవలో పడ్డాడు శేషు. కారుదూసుకుపోయింది....కల కరిగిపోయింది.

అతని కళ్ళలో నీళ్ళునిండేయి.

అతన్ని రక్షించిన వ్యక్తి, మరోఇద్దరు అతన్ని మందలించేరు. కొంత మంది అతన్ని చూసి నవ్వుతున్నారు. ఇంకెవ్వరూ అతన్ని గమనించలేదు.

“నన్ను రక్షించి...నాకు మహోపకారం చేసేరు. మీ మేలు....ఎన్నటికీ మరువ లేను....నా పేరు....అనబోయేడు.

కాని, అతని గొంతులో ఏదో అడ్డుపడినట్లయి మాటపెగల్లేదు. ఎందుకో గట్టిగా కళ్ళుమూసుకొని అక్కడే పడుకుండి పోవాలనిపించింది.....

# పది రూపాయలు!

— 'బాబురావు'

'పండ్లమ్మో పండ్లూ.'

అదే తీయని కంఠస్వరం. అదేమంటలు రగిలించే కేక—మూలమలుపునించి.

సారథి పెద్ద పెద్ద అంగలువేశాడు.

తనలోని ఆరాటాన్ని ఎవరైనా గమనిస్తున్నారేమో నని ఉలిక్కి పడ్డాడు. అటూ యిటూ చూస్తే బోలెంతమంది రోడ్డువెంబడి వస్తున్నారు. ఒక్కరూ తనవైపు చూడ్డంలేదు. ఎవరిమూడ్‌లో వారున్నారు. ఎవరి స్పీడ్‌లో వారు నడుస్తున్నారు.

మూలమలుపు తిరిగాడు.

ముప్పైగజాల దూరంలో ఆమె.

మూణ్ణిమిషాల్లో ఆమె వెనక్కి వచ్చి చేరాడు.

శలాక లాంటి దేహం. రాగివెండ్రుకల సిగ. బొడ్డుమల్లె పూలచెండు. తలమీద పండ్లగంప.

ఆమె మళ్లీ కేకేసింది. 'పండ్లమ్మో.

ఈ తీయని కేకే కొద్దిరోజులనుంచి తనలో అశాంతి రేపుతున్నది. అయస్కాంతంలా ఆకర్షిస్తున్నది. అగ్ని రగిలించి కాల్చివేస్తున్నది, సిగ్గునూ, గౌరవాన్నీ, అభిమానాన్నీ నొక్కిపెట్టేసి, కళ్ళలో కామాన్నికొట్టి గుడ్డివాన్నిచేసి తనవెంట తిప్పుకుంటున్నది.

అతనికి పాలుపోవటం లేదు.

చుట్టూ మరచిపోయి, ఆమె నడుంచుట్టూ చూపునుపెట్టి నడుస్తున్నాడు.

అలా నడవడం దుర్భరంగావుంది.

ఎన్నిరోజులని పరిగెత్తడం? యెంతదూరమని పరిగెత్తడం?

ఈ పదిహేడేండ్ల పండ్లమ్మలో ఇంత ఆకర్షణ యెక్కణ్ణించి వచ్చింది.

ఏమో. ఈ ప్రశ్నకు జవాబు తన కనవసరం.

అ పండ్లమ్మ పండ్లుకూడా అనవసరమే. అవసరమయిందల్లా స్వయంగాఆమె

ప్రశ్నకు జవాబును వెతుక్కోలేక కాదు ఇన్నిరోజుల్నించీ తాను బాధపడు తున్నది. ఆమె అమ్మే పండ్లను కొనుక్కోలేకకూడాకాదు. స్వంతంగా ఆమెను కొనుక్కోలేకనే.

ఇక్కడ మలుపువుంది. తికమకవుంది. చదరంగం గళ్లలో మార్గం దొరకడం లేదు.

ఆమె ఆవే బట్టల్లోవుంది. రెండురోజుల కింద ఆమెశరీరం మీద తానుచూసిన బట్టలే వాటిని ఆమె మార్చినట్లులేదు.

నల్లని వాయిలు గుడ్డ జాకెట్టు పట్టుసడలి, పిటపిటమని కుడిచంకలో చినిగి పోతున్నది. జాకెట్టులోంచి కనిపిస్తూన్న బాడీ ఆమె వయసు వంపుసొంపుల బిగువుకు తట్టుకోలేకపోతూన్నట్లులా వుంది. గోచీ పెట్టికట్టిన మట్టిరంగు చేనేత చీర మాసిపోయింది. ఐతేనేం—ఆమె అందాల రేఖల సొగసుల్ని యేమాత్రమూ పాడుచేయడము లేదు.

కలెక్టరాఫీసు దాటిపోయింది. పోలీసుస్టేషన్ దాటిపోయింది. సారధి ఇంటి దోవ కూడ దాటి పోయింది.

ఆమెను మాత్రం దాటిపోనివ్వడం ఇష్టంగాలేదు.

ఆమెనడుస్తూ ఉంటే వయ్యారంగా, శరీరం మెలికలు తిరుగుతున్నది. పిరుదులు అటూ యిటూ కదలుతున్నాయి. కాళ్ళకున్న వెండి బోలు కడియాలు గలగల చప్పుడు చేస్తున్నాయి. దుమ్ము కొట్టుకున్న ఆమె పాదాలు తారు రోడ్డుమీద కాదు అడుగులు వేస్తున్నది. తన గుండెమీద, వయసుమీద——

ఆమె వెంకటేశ్వరాలయం దగ్గర మలుపు తిరిగింది.
అతడు వెళ్ళేసరికి ఆమె కనిపించలేదు. రోడ్డుచివరిదాక ఎక్కడా ఆమెలేదు.

హతాశుడై ఆలయంలోకీ చూస్తే — అక్కడ గద్దెమీద పండ్ల గంప కనిపించింది,

పోయిన ప్రాణం తిరిగి వచ్చినట్లయింది.
గబ గబా లోపలికి వెళ్ళాడు.

ఆలయ ప్రాంగణంలో ఓ వైపువున్న పంపు దగ్గర కాళ్ళూచేతులు కడుక్కుంటున్నది ఆమె.

అతడక్కడే గంపకు కొద్దిదూరంలో నించున్నాడు.

గర్భాలయానికి కటకటాల తలుపులు వేసి, తాళంవేసి ఉంది. లోపలినుండి బంగారంలో మెరుస్తూ ఉన్న వేంకటేశ్వరుని విగ్రహం ఛాయామాత్రంగా కనిపిస్తూన్నది. ధూపదీపాల వాసనలేచి వచ్చి అక్కడంతా అలముకుని ఉంది.

ఒకవైపు బాదంచెట్టు ఒకటి, బొడ్డు మల్లెచెట్లు రెండు ఉన్నాయి. పక్కన విశాలంగా వేసి ఉన్న పందిరి మీద నిండా పూలతీగలు అల్లుకుని ఉన్నాయి.

పన్నెండు కాలేదు ఇంకా.

గద్దెల మీద ముగ్గురు వృద్ధులు కూర్చుని, 'గుడగుడు' పీలుస్తూ ఏదో చర్చలో మునిగి ఉన్నారు. బొడ్డుమల్లె చెట్టుకింద నలుగురు ఆడపిల్లలు, ఒక మగ పిల్లవాడు రాలిన పూవును రాలినట్లే ఒకర్నొకన్న ముందుగా ఒకళ్ళు అందుకుంటున్నారు.

ఆమె మొగం కడుక్కుంది. పంపు దోసిలిపట్టి నీళ్ల తాగింది, కొంగు తీసి తుడుచుకుంది.

గంప దగ్గరకు వచ్చిన ఆమె చూపులు అతని మీద పడ్డాయి,
ఆ చూపులు — అవి సంకెళ్ళు.
ఆ కళ్ళు — అవి అగాధాలు,
అతడు చూపు మరల్చుకో లేక పోయాడు.
అతని చూపు ఆమెకు అభ్యంతరం కాదులా ఉంది.
దగ్గరగా వచ్చి ఆగింది.
'పండ్లు కావాలా?'
తత్తరపడ్డాడు ఆశ్చర్యపోయాడు. ఆమె కళ్ళలోకి గుచ్చిగుచ్చి చూశాడు.

ఆకళ్ళు నిర్మలంగా, నిశ్చలంగా ఉన్నాయి. ఏ రహస్యమూ దాగివున్నట్లు లేదు. కాని కొంచెం పరిహాసం, మరికొంచెం ధైర్యం ఉన్నట్లున్నాయి.

చూపు మరల్చుకోకుండానే అడిగాడు.

ఏమేం పండ్లున్నాయి?

ఆమె నవ్వింది.

ఆ నవ్వుతో ఎండ వెన్నెలగా మారింది.

'అరటి పండ్లు, సేపులు, అంగూర్లు, మోసంబీలు....

'ధర?'

చూసినంత.

గంపమీది మకిలి గుడ్డ తీసింది.

ఇంకా దగ్గరకు వచ్చాడు.

'బాగానే వున్నాయ్—కః అరటి పండ్లెట్లా?'

రూపాయికి డజను.

'బజార్లో ఎనభై పైసలకే.'

'ఔ. వాడు తన దుకాణ్లు కూసుండి అమ్ముతడు. మేము వాడ వాడకు తిరిగి అమ్మాలె, ఎన్నికావాల్నో చెప్పు. నీకు తొంబై పైసలకే ఇస్తా.'

నవ్వాడు.

'ఐనా ఇంకా పదిపైసలు లాభం'

ఆమె కనుగ్రుడ్లను గమ్మత్తుగా తిప్పింది. వెక్కిరిస్తున్నట్లుగా పెదవుల్ని ఆడించింది.

అయ్యోరామా! మీ పదిపైసల్తో మేం ఏటికి బంగులాలు కట్టుకోమూ? మా బంగులాలు మీ బంగులాలకు పోటీపడితే మీకు నామర్ద కాదూ?

ఇలాఅని ఆమె కిలకిలానవ్వింది.

ఆనవ్వుకు అతని రోమాలు నిం[illegible]న్నాయి.

ఏమీఅనలేక తానూ నవ్వాడు.

చెప్పు అరటిపండ్లెన్ని కావాల్నో ఆమెఅంది.

నువ్వేచెప్పు, ఎన్నిస్తావు?

అంత దగ్గరగాఆమె—మధ్యలో ఒక పండ్లగంపే.

పిచ్చెత్తు తూన్నది.

ఆమె చూపు మరల్చుకోవడంలేదు. తల దించుకోవడం లేదు.

నీ జేబుల పైసలెన్ని ఉన్నాయో నాకెట్ల తెలుస్తది?

'నా జేబులో ఉన్న పైసల గురించి అనుమానంగా ఉందా నీకు,

'నాకెందుకనుమానం? నువ్వు కొనకుంటే నాపండ్లు అమ్ముడు పోవాయేంది?'

కొంచెం పిరికిగా, కొంచెం ధైర్యంగా ఆమె కళ్ళలోకి కొత్తగా, వింతగా, వెర్రిగా చూశాడు.

వయసూ, అందమేకాదు, మాటకారితనం కూడా ఉంది ఆమెలో! ఆమె వయసునూ, అందాన్నీ లొంగతీసుకోవడానికి ధైర్యం చాలును. చొరవ చాలును, డబ్బుచాలును, కాని ఇవేవీ! ఆమె మాటకారితనాన్ని లొంగ తీసుకోలేవు.

ఈ లోకంలో ప్రజ్ఞ గలవాళ్లే గెలవడం లేదు. ప్రజ్ఞ అనేది ఓఅడ్వాంటేజి కూడ కాకపోవచ్చు. దానికి అండగా మరెన్నో ఉండాలి. అవన్నీ తనకు వున్నాయో లేవోనని వెనకా ముందు లాడ్డం తెలివితక్కువ తనమే.

నీకు అమ్ముడు పోతాయి నిజమే. కాని నీపండ్లు నాకెట్లాదొరుకుతయ్?

ఆమె కళ్ళుపెద్దవి చేసింది. తర్వాత నవ్వింది,

బిత్తరపోయాడు.

'నవ్వెందుకు?'

నవ్వునావు. 'నా పండ్లే కావాల్నా?' అని అడిగింది.

'ఔను' పెదవులు పలికాయి.

ఆమె వంగింది, అరటిపండ్ల గుత్తి తీసింది.

'నాకు అరటిపండ్లు వద్దు; కళ్ళు ఎరుపెక్కాయి.

'మరేం కావాలె?'

రక్తం మెదడులోకి చిమ్ముతున్నది. ఊపిరి బిగ బట్టాడు.

'ఈపండ్లు' ఆమె వక్షాన్ని చూపుతూ అన్నాడు.— 'ఈ పండ్లు. ఇవి కూడా' పెదవుల్ని చూపాడు.

ఒక క్షణం కదలిక లేకుండా నించుంది. తర్వాత నవ్వింది,

ఆ నవ్వుల వాగులో పడి అతని వణుకు కొట్టుకుపోయింది. భయం, లజ్జ మునిగిపోయాయి.

అబ్బో! అంది.

అటూ యిటూ చూసి నీళ్లు మింగాడు.
పిల్లలు అల్లరి చేస్తూ ఇటువైపే వస్తున్నారు. తొరగా తేల్చేసుకోవాలి.
'ఎంతిస్తవు?' ఆమే అడిగింది.
ఆమె ప్రశ్నకు ఆశ్చర్యపోయాడు.

ఆమె కంఠంలో గాని, కళ్లలో గాని, వేళ్ల చివర గాని. పెదవుల కదలికల్లో గాని ఎక్కడా భయం గాని, లజ్జగాని. దాపరికంగాని, వణుకుగాని లేనే లేవు.

'నువ్వడిగినంత' అన్నాడు మెల్లిగా.
'పది రూపాయిలియ్యి'.
ప్రపంచమంతా తన కాళ్ల క్రిందికి వచ్చినట్లుగా వుంది.

ఆమె— ఆ పండ్లమ్మ తనదవుతుంది. పది రూపాయిలు— ఒక కాగితం. ఒక బొమ్మ జానెడేవ్.

'ఐతే పద'.
"ఎటు?"
"నా రూంకు."
"ఎవళ్లేరా?"
"లేరు."
ఆమె నవ్వింది. అతడూ నవ్వాడు.

ఆమెకు పండ్లగంప భారంగా వుంది. తనకు కోరికలగంప భారంగా వుంది. ఆమె పండ్ల గంపను తానెత్తాలి. తన కోరికల గంపను ఆమె ఎత్తుతుంది.

ఇందుగ్గాను ధర పది రూపాయిలు!
ఒక్క మాటలోనే బేరం కుదిరింది. కొసరింపులు, కన్సెషన్లూ లేనేలేవు.
ఇందుకు సాక్షి కటకటాల లోపలి వేంకటేశ్వరుడు.
అతడు గంపను ఆమె నెత్తిమీది కెత్తాడు.

* * * *

సారధి రూంలో గంటన్నర తర్వాత—
"నీ పేరు?"
"నా పేరుతోటి పని యిప్పుడు పడ్డదా?"

నవ్వాడు.

ఆమె మాట్లాడలేదు.

"చెప్పు."

"సీతమ్మ"

"సీతమ్మ!"

అతను రిపీట్ చేశాడు. ఆ మాటలో అతని హృదయం యొక్క ఉలిక్కి-పాటు వుంది. అది అతను గ్రహించలేదు. ఆమె కూడ గ్రహించినట్లులేదు.

"నీ మొగుని పేరు?"

అతని కళ్లలోకి చూసి, మొగాన్ని దిండులోకి దాచుకుంది.

ఆమె మొగాన్ని తన వైపు తిప్పుకోవాలని ప్రయత్నం చేశాడు. సాధ్యం కాలేదు.

'చెప్పవా?'

'.........'

"సిగ్గా?"

'.........'

"అబ్బో!"

హఠాత్తుగా ఆమె దిండులోంచి మొగాన్ని తిప్పింది.

'నాకు సిగ్గెందుకు? ఆయన పేరు రామయ్య.'

"రామయ్య!"

మళ్లీ రిపీట్ చేశాడు.

ఆమె వివరాలడగడానికి యిక అతనికి ధైర్యం రాలేదు.

మరో పావుగంట తర్వాత ఆమె అన్నది.

'ఎందుకు సెప్పోతావ్? నవ్వుడేక పెండ్లి చేసుకో'.

అతనికి భలే నవ్వు వచ్చింది.

'నవ్వుతావెందుకు? రేపు నీ పెండ్లాంగ వచ్చేదాని గతి ఏం కావాలె?'.

"నాకు యిరవై రెండేళ్లు అతనన్నాడు."

'ఐతే?'

"నీకు పదిహేడేళ్ళ కన్నా ఎక్కువుండ వనుకుంటా."

'ఔ, కాని....'

"నీకన్నా నేను ఐదేళ్ళు పెద్ద. నీవు మొగుడుండగానే చెడిపోయావు. పెం డ్లాం లేకుండా నేనెట్లా చెడిపోకుండా వుండను?"

ఆమె నవ్వింది.

'నీ గురించి నీకే పట్టిలేదు గాని ఏపెన్నడో వచ్చే నా పెండ్లాంగురించిన పట్టింపు నీకెందుకు?'

ఆమె జవాబు చెప్పలేదు. అసలు జవాబు తోచినట్లు లేదు.

మళ్ళీ నవ్వింది.

ఆ నవ్వును జవాబుగా తీసుకోవడానికి అతనికి మనసొప్పలేదు.

'ఎందుకు నవ్వుతావు?'

'నువ్వు నా కన్న పెద్దోనివైనా, నీకేం తెలావదు'.

ఈ సారి నవ్వడం అతని వంతయింది.

ఆమె రిమార్కు చాలా సూటిగా వుంది. వాడిగా వుంది. దాన్నెలా ఖండిం చడం? అది అబద్ధమని నిరూపించడమెలా? అందుకు ఆమె తనకేం తెలుసునని?

తికమక పడ్డాడు.

ఇక అటువైపు వెళ్ళే ధైర్యం లేక మాట మార్చాడు.

'నీ ఒళ్ళంత చెమటకంపు స్నానం చేసి ఎన్ని రోజులయింది?'

'రెండు రోజులు.'

'స్నానం చేయకున్నా పోనీగాని, ఈ చీరే, జాకెట్టన్నా ఉతికేసుకుంటే ఏం పోయింది?'

'ఏం పోదు.'

'మరి?'

'నా మొగునికి వాసనంటేనే తెలవదు.'

'ఛూ' అన్నాడు.

ఆమె అతని కంపరపాటును చూసి కిలకిల నవ్వింది.

వెర్రిగా ఆమె మీద పడ్డాడు.

'వాసన' అంది.

తన నోటితో ఆమె నోటిని మూశాడు.

............................

ఓ చేత ఐదు రూపాయిల నోటును పట్టుకుని, మరో చేత సింగులు సర్దుకుంటూ ఆమె అంది.

'ఇంకా ఐదు'.
చేయి జేబులోనే వుంది. చేతికి నోట్లు తగులుతూనే ఉన్నాయి.
కాని,
'ఇంకో ఐదు రూపాయిలా!'
తటపటాయించి అన్నాడు.
'లేవు'.
తలెత్తింది.
'పరాసికం చాలు. తియ్యి ఒల్లి.'
పెంకెగా వుంది మాట.
'నిజంగా లేవు.'
బొంకుగా వుంది మాట.
ఆమె కళ్ళు కోపంతో యెఱ్ఱబడ్డాయి.
'అప్పుడు— మరి పది యిస్తానన్న వెందుకు?'

ఇస్తానన్నాడు నిజమే అది దేవుని ముందర. ఇవ్వాలనుకున్నాడు. ఇదీ నిజమే. కాని యిస్తే రేపెట్లా? ఎన్నెన్నో ఖర్చులున్నాయి. ఆ ఎన్నెన్నో ఖర్చులకు డబ్బులు కావాలి. మొదటి తారీఖు యింక పదహారు రోజులగ్గాని రాదు. అందుకని యివ్వలేదు.

జేబులోంచి చేయి తీశాడు. ఆమె చేయి పట్టుకున్నాడు.

ఆమె ప్రశ్నకు జవాబు చెప్పకుండానే ఆమెను దగ్గరకు లాక్కున్నాడు. మంచం మీదకి లాక్కుపోయాడు మళ్ళీ. ఆమె ఏమీ అనలేదు.

'నా ఐదు రూపాయిలు' అంది చివరికి మళ్ళీ.
అతడు గడియారం చూసుకున్నాడు.
'ఫ్రెండ్స్ వచ్చే టైం అయింది'.
'ఐతే?'
'తొందరగా వెళ్ళిపో'.

'ఐదు రూపాయిలియ్యి'.
'లేవు'.
'ఇక్కన్నుంచి పోను'.

చిరాకు వేసింది. వెధవ ఐదు రూపాయిలు. ఇచ్చి వేద్దామనిపించింది. కాని,

ఆమె గదమ పట్టుకున్నాడు.
'ఫస్టునాడు లా యిస్తా'.
ప్రాధేయత వుంది మాటలో.

'ఫస్టునాడు నాకు నువ్వు యియ్యాల్నా? నువ్వు నన్నడుగుతె, ఆ నాడు నేనే యిస్త.

'నాకే యిచ్చేదానివి, నీకిక రూపాయిలెందుకు?'
'నీ జనాటోళ్ల కిచ్చేటందుకు'.
అతనికి కోపం వచ్చింది.
'ఒకసారి చెప్తే వినాలి' అంటు విసుక్కున్నాడు.
'వినవోళ్ళెవలు? నువ్వా, నేనా?'
ఇక్కడ కూడ ఆమెకు భయం వున్నట్లులేదు.
నోటికొచ్చింది వాగకు'.
'కోపమెందుకు? పది రూపాయిలిస్త నన్నవు. యియ్యమంటొన్న'.
'ఇవ్వను'.
'యిచ్చి తీరాలె'.
'యివ్వకుంటే?'
'యిక్కన్నుంచి పోను'.
'నీకు డబ్బెక్కువ కావచ్చుగాని, నాకు పరువెక్కువ'.
ఆమె నిశ్చలంగా అతని కళ్ళలోకి చూసింది.
ఆ చూపుల్ని ఎదుర్కోలేక తల దించుకున్నాడు.
శాంతంగా మామూలుగా అంది ఆమె.
'నీ డబ్బులు వద్దు నాకు. నీ పరువు కూడ వద్దు'.

ఇలా అని ఐదు రూపాయిల నోటును జాకెట్టులోంచి తీసి మంచం మీద

పెట్టింది.

అతడు నోరు తెరచాడు.
ఆమె తలమీదికి పండ్ల గంప నెత్తుకుంది.
'తలుపు తియ్యి' అంది.
ఒక నిమిషం వరకు మాట్లాడలేక పోయాడు.
మంచంమీది ఐదురూపాయల నోటును తీసుకుని ఆమె ముందు నిలుచున్నాడు.
మెల్లగా అన్నాడు.
'సీతా.......'

ఒకింత సేపు ఆమె అతని మొగంలోకి చూస్తూ నించుంది. క్రమంగా ఆమె పెదవులు విచ్చుకున్నాయి.

తలమీది గంపని కిందికి దించింది.
రెండు చేతుల్తోనూ అతన్ని వాటేసుకుని మొగం నిండా ముద్దులు పెట్టింది.
తానే తలుపు తీసింది.
గంప నెత్తుకుని 'పోత' అంది.
రూపాయిలు....?' గొణిగాడు.
'వద్దు'.
ఆమె వెళ్ళిపోయింది, పెదవుల మీద చిరునవ్వుతో.
అక్కడే నిలుచున్నాడు.
కొద్ది సేపట్లో అతని పెదవుల మీద చిరునవ్వు వెలిసింది.
'పోనీ మనకే లాభం. ఈ ఐదు కూడా మిగిలాయి.......'
ఫర్లాంగు దూరం నుంచి ఆమె కేక—
'పండ్లమ్మో పండ్లు'.
వెంటనే అతని పెదవుల మీది చిరునవ్వు మాయ మయింది.
మళ్ళ నవ్వాలని ప్రయత్నించి కూడ నవ్వలేక పోయాడు.

వ్యక్తిత్వాన్ని దెబ్బతీసి, గర్వాన్ని తలగొట్టి, నవ్వును ఎగరగొట్టేసి తనని తనలో కట్టిపడేసిన మహత్తు ఆమె కేకలో ఏమి వుందో— అది ఎంత ఆలోచించినా ఎంతో సేపటిగ్గాని సారథికి అర్థం కాలేదు.

# చీర విప్పని చిన్నది

— యల్. పి. రావు.

'ఒక ఆడది ఒక మగవాడి ముందు చీర యెందుకు విప్పుతుందంటావ్?'

'ఈ మధ్య నీ బుర్ర సరిగా పనిచేయడం లేదని నా అనుమానం; లేకుంటే ఇదేం ప్రశ్న! అరటి పండు వొలిచేదెందుకు అన్నట్టుంది'.

'అయితే నువ్వీకథ వినాలి.'

'మొదలుపెట్టావ్ సోది; సరే కానీ.'

* * * *

"కె. సి. కెనాలు రిపేరుపనులు ఆనాటికి ముగించి పనివాళ్ళు వెళ్ళిపోయారు. ఇంకో అరగంటలో పొద్దు మునగవచ్చు. పి. డబ్ల్యు. డి. సూపర్‌వైజర్ శివకామయ్య మాత్రం అక్కడే నిలబడ్డాడు. అతనికళ్ళు ఒక రెండువందల గజాల దూరంలో వరిపొలంలోవున్న రంగమ్మమీదే వున్నాయి. మధ్యాహ్నం చేనుదగ్గరికి వచ్చిన రంగమ్మ కలుపుతీస్తూ, గట్లుసరిచేస్తూ అక్కడేవుంది. వరిచేనులాగే నిండుగా పండిన రంగమ్మ యౌవనం శివకామయ్యను రెచ్చగొట్టింది. కూలీలకు పనులు పురమాయిస్తూ చూపుల్ని రంగమ్మ మీదకు ఉసికొల్పుతూ పగలంతాగడిపాడు. సాయంత్రం ఒంటరిగా దొరికినప్పుడు తన కోరిక తీర్చుకోవచ్చని ఉబలాటపడ్డాడు. రంగమ్మ కాదంటుందేమో, తనకోరిక ఫలించదేమో అన్న సందేహం అతనిలో కలగనే లేదు. పుట్టిపెరిగిన వూరికే బదిలీ అయినప్పటినుంచి అతని రసిక జీవితం మూడు పువ్వులూ ఆరుకాయలుగా సాగుతూవుంది. ఇటు పల్లెగాక అటు పెద్ద పట్టణమూగాక వుండే ఆ వూరు బహు పసందుగావుంది సూపర్‌వైజర్‌కి.

వంగి పనిచేస్తున్న రంగమ్మ శివకామయ్యలో కొత్తకోరికల్ని రేపింది. ఇంతలో లేచినిలబడి చక్కగా అతను నిలిచిన చోటికే, పిలిస్తే వచ్చినట్టుగా, నడిచింది. శివకామయ్యకూడ ఆశ్చర్యపోయాడు. మరుక్షణంలో 'ఆశ్చర్యపోయినందుకు తన మీద తనకే కోపమొచ్చింది. ఇందులో ఆశ్చర్యమేముంది? హి-హీ అని చిన్నగా నకిలించాడు. అక్కడే దగ్గరగావున్న మెట్లదగ్గరకు వెళ్ళింది రంగమ్మ.

'ఏమే రంగీ, ఒక్కదానివే వచ్చినావు. నీ మొగుడు రాలా?' అన్నాడు,

మెట్లుదిగుతున్న రంగమ్మతో.

'లేదయ్యా, పొద్దుగూకినాక వస్తాడు. రాత్రికి యాడేవుంటాడు' అంది,

నీళ్ళలో రెండుమెట్లుదిగి చేతులూ మొఖమూ కడుక్కుంటోంది రంగమ్మ. 'భద్రమే రంగి, జారిపడేవు!' అంటూ రెండుమెట్లుదిగాడు శివకామయ్య. కడుక్కోటం పూర్తి చేసుకొని లేచినిలబడింది రంగమ్మ. 'ఇదేమి కడుక్కోటమే, నీ మొగాన బురదైనాపోలేదు!' అని రంగమ్మ చెక్కిలిమీదికి చెయ్యిపోనిచ్చాడు. రంగమ్మవెంటనే వెనక్కి జరిగింది. కొంచెం అనుమానిస్తూ చూసింది అతని వైపు. 'అట్లా భయపడతావేమే, నీ మొగుడిప్పుడే రాడులే' అంటూ కొంగు పట్టుకున్నాడు. రంగమ్మ నివ్వెరపోయింది. అతని చేతిలోనుండి చీరచెంగును లాగటానికి ప్రయత్నించింది. శివకామయ్య ఇకిలించాడు. 'అదేమే రంగీ. కొంగుపట్టుకుంటేనే కోకవూడదీసినట్టు ఉలికి పడతావే రా!' అంటూ యింకా బలంగా లాగబోయ్యాడు. కొంగుచాటునుండి బయటపడిన యౌవన శిఖరాల్నిచూసి అతని కోరిక కట్టలు తెంచుకుంది. రంగమ్మ వాని యెదట వివస్త్ర అయినంతగా మథన పడింది. పురుషజంలో రంగమ్మలో శక్తి ప్రవేశించింది. 'పోరా! పాపనయ్యాకు తిమ్మిరెక్కినట్టుందే, ఇడుసూ! అని పురుగును దులిపినట్టు విదిలించివేసింది. చివరి మెట్టుమీదవున్న శివకామయ్య ఆ విదిలింపుకు దభీమని నీళ్ళలో పడ్డాడు. 'బాగైంది ముండాకొడుక్కి' అని అంత కోపంలోనూ చిరునవ్వు నవ్వుతూ మెట్లెక్కింది రంగమ్మ.

గట్టుమీదికొచ్చి తిరిగి చూచిన రంగమ్మ నిర్విణ్ణురాలైంది. శివకామయ్య కనిపించలేదు. 'వచ్చినోడికి ఈత రాదో యేమో' నని విలవిల్లాడింది. యింతలో శివకామయ్య అంత దూరంలో కనిపించాడు. నీటిప్రవాహం బలంగా వుంది. మునుగుతూ తేలుతూ కొట్టుకుపోతున్నాడు. రంగమ్మకు గుండె ఆగినంత పనైంది. పిచ్చిగా కేకలేస్తూ గట్టువెంబడి పరుగెత్తసాగింది. కనుచూపుమేర దూరంలో యెవరూ లేరు. శివకామయ్యకు చావు తప్పదు అనుకుంది రంగమ్మ. ఒక మైలు దూరంలో తప్ప మెట్లులేవు. కాబట్టి మెట్లమీది నుంచి చెయ్యి అందిచ్చే వీలుకూడలేదు. శివకామయ్య గట్టువెంబడే కొట్టుకుపోతున్నాడు. సిమెంటు చేయబడిన గట్టును పట్టుకొని నిలిచేదానికి విఫల ప్రయత్నం చేస్తున్నాడు. మునుగుతున్నాడు, తేలుతున్నాడు. గట్టుమీద రంగమ్మ పిచ్చిదానిలా 'అయ్యో అయ్యో సంపేసినానుపోయ్' అని కేకలేస్తోంది.

వెంటనే మెరుపులాంటి ఆలోచన తట్టింది. తట్టిన వెంటనే రంగమ్మ చీర విప్పడం ప్రారంభించింది. క్షణంలో నగ్నంగా తయారైంది. చీర కొస ఒకటి

సరిగా శివకామయ్య తలమీద పడేలాగు విసరి యింకో చివర గట్టిగా పట్టుకుంది, నీళ్ళలోంచి బయటపడ్డ చేపలాగ చావు బ్రతుకుల మధ్య కొట్టులాడుకుంటున్నాడు శివకామయ్య. ఎగిరిపోతున్న పంచప్రాణాల్ని పట్టుకున్నట్టు చీరకొసనుపట్టుకొన్నాడు. ఒక చేత్తో చీరకొసను ఇంకోచేత్తో గట్టు పట్టుకొని మునగకుండా నిలవగలిగాడే కాని ప్రవాహ వేగానికి ముందుకు పోతూనేవున్నాడు. పైగా శివకామయ్య ఘనకాయాన్ని తీగలాంటి రంగమ్మ శరీరం ఆపలేకపోయింది. గట్టిగా చీరకొసను పట్టుకొని రంగమ్మ ముందుకు పోతూనే వుంది. దైవవశాత్తు గట్టుమీదగుబురుగా పెరిగిన పొద ఒకటి ఎదురైతే వెంటనే చీరను దానిచుట్టూ చుట్టి కొసను పట్టుకొని అక్కడే కూలబడింది రంగమ్మ. పట్టుదొరగ్గానే శివకామయ్య మెల్లగా గట్టుపైకి వచ్చాడు. మృత్యువు పొలిమేరల్లోకి అడుగు పెట్టివచ్చినవాడుకాబట్టి భయమూ, అసహాయతా తగ్గలేదింకా. కాళ్ళల్లో నడిచేశక్తి లేదు, కడుపునిండా తాగిన నీళ్ళు కనుగుడ్లలోంచి బయటికి వస్తున్నట్టుంది. తాగిన వాడిలా తూలుతూవచ్చి రంగమ్మకాళ్ళమీద పడ్డాడు, 'ఈ జన్మలో నీ ఋణం తీర్చుకోలేను రంగీ!' శివకామయ్యమాటలు యేడుపులా వచ్చాయి, రంగమ్మ ముఖంలో వెర్రి ఆనందం కనబడింది, 'హమ్మ! సచ్చినోడు బతికినాడు బతికినాడులే' అనిగొనుక్కుంది. తాను నగ్నంగావున్న సంగతి చాలాసేపటివరకు తట్టనేలేదు రంగమ్మకు. అది గ్రహించినవెంటనే చీరను బరబరాలాగి నడుముకు చుట్టుకుంది భయం భయంగా. ఎవరూ లేరుగదా అని చుట్టూ ఒకసారి చూసుకుంది. స్పృహలేకుండా పడిపోయిన శివకామయ్యవీపుమీద, డొక్కల్లోనూ నొక్కింది, ఆయాసం తగ్గింది. శ్వాస బాగా ఆడుతోంది. ఇంక పరవాలేదని గ్రహించి వూరివైపు దారితీసింది రంగమ్మ.

---

# పేదవాని పెదవి

— త్రివిక్రమ్

"ఏమిటీ పిచ్చిపని?" - అంటూ మందలింపుగా చూసి, చటుక్కున పాదాలు వెనక్కి తీసుకున్నాను. 'నిర్మల' స్వచ్ఛంగా నవ్వుతూ, నా పాదాలు స్పృశించిన చేతులను కళ్లకద్దుకుంది, మెల్లగా నా యెదురుగావున్న కుర్చీలో కూర్చుంది.

"నా జీవితాన్ని సంస్కరించారు, నా భవిష్యత్తుకొక బాటవేశారు. ఆ ఆనందమేయిది. నా ఆనందం అపసవ్యంగా, అనుచితంగా అవుపిస్తోందా రవిబాబు?" దీనంగా ప్రశ్నించింది, నాకేసేచూస్తూ విచలితుణ్ణయ్యాను.

"అబ్బే, అదేమీకాదు నిర్మలా! అపార్థం చేసుకోకు. నా కెందుకనో యిటువంటివి పడవు. ఎదుటివ్యక్తి మీద మనకున్న గౌరవభావం ప్రకటించడానికి 'చరణధూళి'ని స్వీకరించనక్కరలేదు. ఆ భావమేదో మనసులో నిక్షిప్తమై వుంటేచాలు— అనుకుంటాను నేను."

ఆమెలో ఏదోమార్పు అగుపించింది. ఉద్వేగంతో అన్నది.

"మీకే కాదు రవిబాబూ! చాలా మందిలో యిలాంటి భావాలు ఊడలు దించుకుంటున్నాయి. పాత అంటే 'రోత' కావాలని కల్పించుకుంటున్న వ్యక్తులు కోకొల్లలుగా ఉన్నారు. 'పాత' అంటే మనం అనుభవించినదైనా, చూసినదైనా కావాలి. ఇవి రెండూ కానిది క్రొత్తదే! మన సంప్రదాయాలన్నీ ఒట్టి 'ట్రాష్' అని ఏవగించుకునే ప్రబుద్ధుల్లో ఎందరు వాటిని ఆచరించి చెడును నిరోధించారు? చెప్పండి—"

"లేదు. నిజమే! ఒప్పుకుంటున్నాను. అయితే మన ఆచారాల్లో మూఢత్వం లేదని నీవనగలవా?"

"ఏ కొద్దో ఉండి ఉండొచ్చు రవిబాబూ! అంతమాత్రం చేత 'యూనివర్సల్ అప్లికేషన్' చేసి కాష్టంలో కలిపెయ్యటమేనా ఆధునికత? ఇపుడు మీకు పాదాభివందనం చేసాను. అయితే అది అంతరంగం లోంచి పొంగుకు వచ్చిన ఆనందాతిశయమే కాని మరోటి కాదుగద? కానీ, అది మీకు అంతగా నచ్చకపోవటానికి కారణముంది. ఈ పాదాభివందనాలు, చరణధూళి శిరస్సున దాల్చటాలు పురాణేతిహాసాల్లో

చదివిన మీరు- అవన్నీ అభూత కల్పనలని విశ్వసించే మీరు, యిప్పటి రోజుల్లో వాటిని కళ్ళెదుట కనిపించే దృశ్యాలుగా భరించలేరు. అవి సమసి పోవాలనే వాదం మీది. సమాధులమీద పునాదులు నిర్మించాలన్న ఆశయం మీది. అంగీకరిస్తారు కదూ?"

నవ్వేను. నిర్మల ఎప్పుడు వచ్చినా అంతే. నన్ను 'రూట్ హెయిర్స్' వరకు కదిలించి కానీ వదలదు. ఆమెకు వెర్రి తలలు వేసే అధునాతనమంటే అగ్గి మీద గుగ్గిలం. నాకు బూజు పట్టిన సనాతన మంటే అసహ్యం. సమాజం కుళ్ళిపోవటానికి కారకులయిన సనాతన ఛాందసుల మీద చెప్పరాని కసి నాకు. హత్య చేయాలన్నంత కసి!

నేను ఏ 'కందుకూరి' వారి కాలంలోనో జన్మించాల్సింది. ఈ 'టెర్రరిస్ట్' భావాలతో ఏ 'సమాజోద్ధరణ సేన' పేరుతో విప్లవ సైన్యం నిర్మించి, యిల్లిల్లా దాడి చేసి- బాల వితంతువులకి పునర్వివాహాలు, కన్యాశుల్కాల కోసం కక్కుర్తి పడే వాళ్ళకి బుద్ధి వచ్చే రీతిలో బహిరంగ శిక్షలూ అమలు పరిచి వుండేవాడిని.

కాస్త ఆలస్యంగా పుట్టాను.

'నిర్మల' లేచి నిల్చుంది. "కొంచెం పని తొందర మీద వెళ్తున్నాను ఆదివారం అలా వస్తారు కదూ?"

"ఏమిటి విశేషం?" నవ్వుతూ అడిగాను.

"మీరు మా యింటికి రావటమే!"

"అయితే రాను. వృథాగా నీ కాలాన్ని చెడగొట్టటం నాకిష్టం వుండదు, హాయిగా ఏమన్నా చదువుకుంటాను."

"కాదు. రావాలి! ఎదురుచూస్తాను. వెళ్ళొస్తా" అంటూ అచిరద్యుతిలా చిటికెలో మెరిసి మాయమయింది.

'నిర్మల' నిజంగా ఒక విచిత్రవ్యక్తి!

చేతిలో వున్న 'చలి నెగళ్ళు' బల్ల మీద బరువుగా పడేసాను. బద్ధకం అనిపించింది. ఒళ్ళు విరుచుకుంటూ 'ఫ్రీ' గా వెనక్కి వాలాను. మస్తిష్కం నిండా వేలాది ఆలోచనలు. 'చలి నెగడు' మీద నిప్పురు కప్పినట్లు, వేడి అందనట్లు, నరాలు చలికి బిగిసి పోతున్నట్లు, వేళ్ళు కొంకర్లు పోతున్నట్లు— భావన.

ఇలా స్తబ్దంగా వుంటే, ఒక్కోమాటు ఆ యేకాంతం నన్ను ఎక్కడికిలాక్కెళుతుందో ఏమేమి ఊహాగీతాలు వినిపిస్తుందో అనూహ్యం. ఎక్కువ కాలం నాతో నేను గడపాలనే వాంఛించే వ్యక్తుల్లో నేనొకణ్ని

ఆలోచనల్ని మృష్టాన్నంలా స్వీకరించి, ఆత్రంగా అరగించే మనస్సు భుక్తాయాసంతో బాధ పడుతున్నట్లు, కప్పను మ్రింగిన పాములా మగతలో పడింది.

అంత మగతలోనూ, మసకబారిన గతంలో సంజె వెలుగు లాంటి సత్తువ లేని ఒక స్మృతివీచిక ఎదలో కదలాడింది...

* * * *

తలుపు మృదువుగా తడుతున్న సవ్వడి!

పటుక్కున లేచి కూర్చుని "ఎవరు" అన్నాను గంభీరంగా.

సమాధానంగా మళ్ళీ మృదువుగా, కోమలంగా తలుపు మీద తట్టిన ధ్వని, లయగా మంజీర గాజుల గలగల! ఆశ్చర్యంతో భృకుటి ముడివడింది, అనాలోచితంగానే అడుగు ముందుకు వేసాను.

"ఎవరు మీరు?" తలుపు తీసి ఎదురుగా ఉన్న అపరిచయస్తురాలిని ఆపాదమస్తకం పరికిస్తు ప్రశ్నించాను.

"నేను నిర్మలని, నన్ను లోపలికి రానివ్వండి ముందు. ఇట్లా గడపయందే నిలబెట్టటం మీకు మర్యాద!" కాదు

"గదిలోనికి రానివ్వటం అంత కంటే అమర్యాద యేమో?"

"ఉష్... మీరు తప్పుకోండి, ఇప్పటికే మీ ప్రక్క గదులవాళ్ళు తినేసేలా చూస్తున్నారు." అంటూ చొరవగా లోపలికి నన్ను నెట్టుకుంటూ మరీ వచ్చింది. తెల్లబోయి చూస్తున్న నా కేసి నవ్వుతూ చూసి నేను అడక్కుండానే తలుపులు జేర వేసింది.

'ఆడది' అంత చొరవ చూపటం నా జీవితంలో ప్రథమంగా అనుభవంలోకి వచ్చింది! కనీసం కలలో కూడ యిలాంటి సంఘటన ఊహించి వుండలేదు. ఆమె కేసి విచిత్రంగా చూస్తూ నిలబడ్డాను.

"కూర్చోండి, నేనేమి వింతజంతువుని కాను. మనిషినే. కాకపోతే ఆడ దాన్ని. ఆకర్షణని. సుమపరిమళాన్ని. మకరందాన్ని. అందుకే తూనీగను వెతుక్కుంటూ వచ్చాను," నవ్వుతూ తనంతటతనే, నిర్మొహమాటంగా ఒక కుర్చీలో ఆసీనురాలయింది.

నాకెందుకో 'వెగటు' కలిగింది. ఆమె మాటలధోరణినిబట్టి విషయాన్ని కొంత గ్రహించాను! అది ఖరీదైన హోటలు. 'కష్టమర్సు'కి సకల సౌకర్యాలు సమకూర్చటంలో మేనేజిమెంటువారి శ్రద్ధ 'నిర్మల'వంటి చాకులాంటి అమ్మాయిల్ని పచ్చనోట్ల పందిరిలో విశ్రమించే ధనికుల సంతోషానికి వెచ్చించడంలోనే విశదమౌతున్నది.

'నిర్మల'కేసే చూస్తూ కూర్చున్నాను. ఆమె మొహంలో చెరగని నవ్వు. ఎందుకనోగాని ఆమె నవ్వు పాలరాయంత స్వచ్ఛంగా తోచిందినాకు. మొహం ఎంతో తేటగా, నిర్మలంగావుంది,

ఇంకా స్పష్టీకరించాలంటే - పసిపాప మొహంలా వుంది! అలాటి అమ్మాయిని ఆటబొమ్మగా ఆడుకోవటం క్రూరుడుతప్ప వేరొకడు సులభంగా చేయలేరు.

"నిర్మలా! కాస్తోకూస్తో చదువుకున్నదానిలా అగుపిస్తున్నావ్. ." నా మాట పూర్తికాలేదు— "కూస్త ఏమికర్మ? బి. య్యే. చదివాను." అంది కాస్త పైశ్రుతిలో నవ్వుతూ.

'షాక్'తిన్నాను - "బి. య్యే.?!"

"ఆశ్చర్యం అక్కర్లేదు రవిబాబూ!" - ఉలిక్కిపడ్డాను.

"రవిబాబూ?! నా పేరు నీకెలాతెలుసు?" ఆశ్చర్యం ప్రకటించాను,

"మీరింత అమాయకులనుకోలేదు! యిది హోటలు బాబీ!! మీకు గది కేటాయించేముందు 'కౌంటర్'లోని వ్యక్తి మీ వివరాలు రాసుకుంటాడు—" చిలిపిగా నవ్వుతోంది.

'షేమ్' అయినట్లు 'ఫీ'లయ్యాను. చొక్కా గుండీ నలుపుతూ ఓ క్షణం నిశ్శబ్దం పాటించాను. హఠాత్తుగా ఆమెకేసి చూస్తూ" ఇంతచదువు చదివినదానివి యిలాంటి హేయమైన పనిచేసేందుకు అభిజాత్యం అడ్డుపడలేదా? ఆత్మహత్యా సదృశమైన యీ పని చేసేకంటే గుక్కెడు విషంత్రాగటం ఉత్తమంకాదా?" అన్నాను.

ఆమె లేచినిల్చుంది. కోపంవచ్చినట్లు ఆమె మొహమే చెబుతోంది. రక్తం

యావత్తూ మొహంలోకి చేరింది. నవ్వు ఎప్పుడో పారిపోయింది, పెదాలు స్వల్పంగా కంపించటం కనిపిస్తోంది.

నిముషందాకా ఏమీ మాట్లాడలేకపోయింది.

అంతలో తననుతాను నిగ్రహించుకొని, పేలవంగా నవ్వుతూ "క్షమించండి! నేను ఎలా ప్రవర్తించాలో మర్చిపోయాను—" గొంతు సవరించుకొంది. చేరుమాలుతో కన్నీటి పొరలను అద్దుకొంది.

మెల్లగా సమీపానికివచ్చి, తియ్యటి నవ్వుని బలవంతాన పెదవులమీద అతికించి, సోఫామీద నన్ను బాగా ఆనుకుంటూ కూర్చుంది. ఘాటయిన సువాసన అప్పుడుగానీ నన్ను పలకరించలేదు! బహుశః రుమాలులో దాగి ఉండాలి.

"ఎక్స్‌క్యూజ్‌మీడార్లింగ్! లెటజ్ హేవె డ్రింక్-"అంటూ 'బజర్' నొక్కింది. నిశ్చలంగా ఆమెకేసేచూస్తు "నీప్రయత్నాలు నిష్ప్రయోజనమని ఎంతత్వరగా గ్రహిస్తే అంతమంచిది నిర్మలా! నేనలాంటివ్యక్తినికాను. నువ్వెళ్లొచ్చును. కానీ ఒక్కమాట చదుకున్నా వన్నావ్, ఏదన్నా ఉద్యోగంచేసుకుని గౌరవంగా బ్రతుకు, నీ భవిష్యత్తుకి చాలా మంచిది. గుడ్‌బై!" గుక్కతిప్పుకోకుండా అన్నాను.

అంబుధి అంచున అణిగి పోయిన కెరటం, పునర్జన్మించి ప్రచండ వేగంతో విరుచుకు పడ్డట్లు ఆమెలో మళ్ళీ ఆగ్రహం చెలరేగింది!

"ఉద్యోగం చెయ్యనా? ఏం ఉద్యోగం చెయ్యను? నాతో చదివిన గ్రాడ్యుయేట్లు యీ హోటల్లో 'బట్లర్స్'గా ఉన్నారు! కొందరు యీ ఊళ్లో టాక్సీ నడుపుతున్నారు. ఇంకొందరు ఎంప్లాయ్‌మెంటు దేవాలయం చుట్టు ప్రదక్షిణాలు చేసి పుణ్యం మూటగట్టుకొంటున్నారు. నేను ఏమి చెయ్యగలను? ఆ పనుల్లో ఏ ఒక్కటీ నావల్ల కాదు. నేను ముందు వెనుకల నుయ్యి, గొయ్యిలతో- నాన్నగారు వదిలి వెళ్లిన అప్పులాళ్ల జలగలతో బ్రతికిన దాన్ని. అమ్మ బ్రతుకుని పక్షవాతానికి బలిపెట్టలేక, కడుపులోని నరాల్ని ఆకలిమంటలో దగ్ధంచేసే ధైర్యం లేక, ఆత్మహత్య చేసుకోగల సాహసం లేక, యీ మార్గాన్ని ఎంచుకున్నాను, నయం! భగవంతుడు స్త్రీకి యీ 'ఆధార' మన్నా యిచ్చాడు! అదికూడ లేని మగవాడి బ్రతుకు మాత్రం చాలఘోరం... ఐ రియల్లీ పిటీ హిమ్!" కసిగా అంది.

"ఇలా విచిత్రంగా ఉంది నీ సమాధానం నిర్మలా! తాడిచెట్టు ఎందుకు

ఎక్కువంటే దూడమేత కోసమన్నట్లుంది. ఉద్యోగం లభించలేదు కాబట్టి భగవంతు డిచ్చిన ప్రీత్వాన్ని దుర్వినియోగం చేస్తూ పతవు వృత్తి చేపట్టా నంటావ్? ఎంత ఘోరమయిన అబద్ధం! ఈ విశాల ప్రపంచంలో నీకు కడుపు నింపుకోవటానికి చిన్న ఉద్యోగం దొరకటం దుర్లభ మంటే నమ్మమంటావా?"

అంతలో తలుపు తట్టిన శబ్దమైంది. "కమిన్ హరీ!" అంది నిర్మల. బట్లర్ దుస్తుల్లోఉన్నవ్యక్తి చేతిలో 'ట్రే'తో వచ్చాడు. దాంట్లో 'డ్రింక్స్-సరంజామా' వుంది! అతను లోపలికి రాగానే మళ్లీ తనే తలుపులువేసి "హరీ....కాస్త నీ గురించి విన్పించు ఈ దొరగారికి - డన్‌లప్ పరుపులమీద విశ్రమించేవారికి మనదేశంలో నిరుద్యోగులున్నారన్న నమ్మకం కలగటంలేదుట!" వ్యంగ్యంగాఅని నాకేసి చేతినిచూపింది.

'హరి' మా యిద్దరికేసి అయోమయంగా చూసాడు. అతని మొహంలో భంగిమలు విచిత్రంగా మారాయి. "సుఖంగా కాలక్షేపంచెయ్యక ఏమిటీపనికిరాని ప్రశ్నలు?" అన్నట్లు నా కేసి చూసేడు.

"హరీ! నిర్మలమాటలు నిజమేనా? అయితే నువ్వొ ఒక గ్రాడ్యుయేట్ వేనా?" ఆసక్తిగ ప్రశ్నించాను. దీర్ఘంగా నిట్టూర్చి 'ట్రే'ని బల్లమీదపెట్టి చేతులు విదిలించుకున్నాడు.

సిగిరెట్టు వెలిగించుకుంటూ, నాకోటి 'ఆఫర్' చెయ్యబొయ్యేడు. వద్దన్నాను. గట్టిగా ఓదమ్ములాగి వదిలి "ఐయామ్ బి.ఏ. బట్. విత్ షేమ్‌ఫుల్ జాబ్. మే గాడ్ సేవ్ దిస్ పూర్ యిండియా ఫ్రమ్ ఆల్ ది రిఫార్మర్స్" అన్నాడు కసిగా.

నాకు నిజంగా జాలివేసింది. "ఐ రియల్లీ పిటీ యూ హరీ! నాకు యీ విషయం యింతవరకూ తెలియదు. ఐ ప్రామిస్ టు గెట్ బోత్ ఆఫ్ యు ఎంప్లాయిడ్ యిన్ గుడ్ జాబ్స్." అన్నాను అభయం యిస్తున్నట్లు.

సిగిరెట్టు నుసి ఆష్ట్రేలో రాలుస్తూ "నో నో మిస్టర్ జెంటిల్‌మెన్ నాకు గుమాస్తాగిరీ వొద్దు, చాకలి గాడిదలతో పోటీపడే ఆ బరువులతో నా వెన్నెముక విరిగి పోవటమూ వద్దు. నేను పేరుకి బట్లర్‌ని. కానీ బి.ఏ. అన్నసంగతి మర్చిపోవాలి తప్పదు. అప్పుడు తేలిగ్గా జీవితంతో ఎడ్జస్టు కాగలను. నా జీతంతో జీవితాన్ని తృప్తిగానే గడుపు తున్నాను. పైన మీవంటి పెద్దచేతులు విదిలించే 'టిప్స్' కూడా తక్కువేమీ కాదు. కానీ నాకు కడుపులో' పచ్చభాస్వరం' మండుతున్నట్లు బాధ కలిగించేది 'నిర్మల' బ్రతుకే. అందం ఉన్నంత వరకూ ఆమెకు ఆదరణ! ఆరో

గ్యాంక్షిణించి అందం అడుగంటిన తర్వాత 'కరుణశ్రీ' వివరించిన 'బీదపూలు' బాధ యీమె గాథకి అద్దం పడుతుంది.

మీరేమన్నా నిజంగా చేయదలిస్తే 'నిర్మల' కి చేయండి. అదేనాకుఆనందం

-'నిర్మల' నేత్రాలు సజలాలైనాయి. గద్గదంగా "హ-రీ" అంది ఏడుపు మింగలేక. నా మనసు ఆర్ద్రమైంది.

"చేస్తాను-తప్పకుండా ఆమె జీవితాన్ని సంస్కరిస్తాను. కానీ, యీ తక్షణంనుండీ యీ పాప కూపంనుండీ బైటికి గెంతితేనే!"-అన్నాను ఆవేశంగా.

గెంతేది సురక్షితమైన ప్రదేశం మీదకే అన్న భరోసా లభిస్తున్నపుడు సంశయమెందుకుంటుంది సార్?" అన్నాడు సిగరెట్టు ఆష్ట్రేలో ముంచుతూ 'హరి'.

* * * *

అట్లా తారసిల్లింది 'నిర్మల' నాకు!

నాకున్న పలుకుబడితో ఆమెకోచిన్న ఫ్యాక్టరీలో ఆడకూలీల మీద 'సూపర్ వైజర్' పని యిప్పించాను. జీతం రెండొందలయాభై. సంవత్సరాంతాన లాభాల్లో మూడోవంతు పనివాళ్ళకి 'బోనసు'గా ముట్టుతుంది.

ఆమె పనల్లా కూలీలను ప్రోత్సహించి పని బాగా చేయించటం, నెలజీతాలు పంపిణీ చేయటం, కూలీలు యజమానులకు విన్నవించు కోదల్చిన విషయాలు వాళ్ళ తరుపున మాట్లాడటం.

అచిర కాలంలోనే ఆమెకు, కార్మికులకూ సాన్నిహిత్యం ఏర్పడింది. ఆమె అంటే యజమానులకు సదభిప్రాయం ఏర్పడింది. ఆమె జీతంలో మరికొంత అధికంచేసి తమ మంచితనాన్ని వెల్లడించుకున్నారు యాజమాన్యంవారు.

'ఫ్యాక్టరీ' నుండీ తిరిగివచ్చిన తర్వాత ఊరికే కూర్చోదు నిర్మల, పిల్లలకి చదువు చెబుతుంటుంది. తరచుగా నన్ను కలుసుకునేందుకు వస్తుంటుంది. ఏదో సంభాషణ ఆరంభిస్తుంది. అంతలోనే ఆవేశానికి లొంగిపోతుంది. భావోద్వేగం ఆమెలో చాలఎక్కువ. స్వభావం మళ్ళీ నవనీతమే.

ఈ రోజు 'నిర్మల' నావద్దకొచ్చి పాదాభి వందనం చేయటంలో ఒకానొక

విశేషముంది. ఆమె జీవితం 'మలుపు' తిరిగిన రోజు యిదే! అదొక పర్వదినంగా ఎంచుకుంటుంటామె.

ఆమె కంటికి నేనొక దేవపురుషుణ్ణట! నా చరణధూళిని కళ్లకద్దుకుంటే అదొక అనిర్వచనీయమయిన ఆనందమట. నిజమేనా?!-అని ప్రశ్నించుకుని, అంతలోనే "ఛఛ" అనినన్ను నేనే మందలించుకుంటాను.

'నిర్మల'కి పిచ్చిపట్టిందని, ఆ ప్రేలాపన అంతా నిజమేనన్న భ్రమలో మునిగిపోవటమేమిటి? నాకు తోచినదేదో నేను చేసాను, శక్తి ఉంది కాబట్టి సాయం చేసాను. దీపం ఉంది కాబట్టి చీకటిని చీల్చాను! అందులో నా ప్రయోజకత్వమేముంది?

నాకు అమితాశ్చర్యం కల్గించేదేమిటంటే-ఒకప్పుడు సంఘాన్ని అమితంగా ద్వేషించిన నిర్మల, లోకం మీద కత్తిగట్టి కక్ష సాధించదలచిన నిర్మల-నేడు సనాతనాన్ని గౌరవించే పడతిగా రూపాంతరం చెందింది.

నేను సనాతన ద్వేషిని. ఆమె సనాతన ప్రేమి!

ఇద్దరం-ఉత్తర దక్షిణ ధృవాల వంటి వాళ్లము. అయినా భావాలు భిన్నత్వంలో ఏకత్వంగా ఉంటాయి. అదే లేకపోతే-యీ ధృవాల కలయిక అసాధ్యమయ్యేది! 'నిర్మల' ఆహ్వానాన్ని మన్నించి, ఆదివారం వెళ్లాను!!

* * * *

"బాబూ! నిర్మలమ్మగారు ఆసుపత్రిలో ఉంటారు, తమర్ని వెంటనే రమ్మన్నారు." వగరుస్తు ఒక్కోమాటా విన్పించాడా కార్మికుడు.

చేతిలో ఉన్న బాపిరాజు 'తుఫాను' అప్రయత్నంగా జారిపడింది. "ఆస్పత్రిలో ఉందా? ఎందుకని? ఏమైంది? ఎప్పుడు జేర్పించారు? తొందరగా చెప్పు." అంటూ వాడిని ప్రశ్నలతో ఉక్కిరి బిక్కిరి చేసిపారేసాను.

"బాబూ! అయన్నీ సెప్పాలంటే శానా సేపవుద్ది. తమరు ఎంటనే ఎల్లాలి. ఆ తల్లి శానా పెమాదంలో ఉండాది." "చావి తీర్చుకుని గద్గదంగా, గ్రుడ్లనీరు కుక్కుకుంటూ తొందరచేసాడు.

అదరా, బాదరా సిద్ధమై-అఘమేఘాల మీద ఆస్పత్రికి వెళ్లాను. అది గవర్నమెంటు ఆస్పత్రి. అందులో డాక్టర్లు నాకు బాగా పరిచయస్తులు.

'నిర్మల' ఎక్కడుందో తెల్సుకోవటం కష్టమనిపించలేదు. ఆ వార్డు దగ్గర ఆడ కూలీలు గుమికూడి ఉన్నారు. కొందరు మొగవాళ్లకూడ ఉన్నారు.

ఆత్రుతంగా అడుగు లోపలికి వేశాను. కళ్ళెదుట దృశ్యం కళ్లు చెదర గొట్టింది. 'సిలైన్' సీసాలోంచి ద్రవం 'నిర్మల' రక్తనాళాల్లోకి ప్రవహిస్తోంది. గుండెలదాకా దుప్పటి అచ్ఛాదితమై ఉంది.

మొహం మీద ఏవో గాయాలు! కపోలాలు కమిలి పోయి ఉన్నాయి. విష యం ఏమీ అర్థంకాలేదు....పెదవులకేసి చూసి 'షాక్' తిన్నాను ఎందుకలా వాచి ఉన్నాయ్? ఏమిటా రక్తం....?! ఆ డేదో గాయంలా ఉంది. నెత్తురు గడ్డకట్టిన ధా యలు....జుట్టు 'తుఫాను' భీభత్సానికి కకావికలయిన 'మాగాణి' పంటలా అస్తవ్య స్తంగా ఉంది. కళ్లు ఉబ్బిఉన్నాయి.

మొహం-ఒకనాడు నేను పాలరాతి స్వచ్ఛతనీ, పసిపాప అమాయకత్వాన్నీ చూచి మురిసిపోయిన మొహం, అతి భీకరంగా మృత్యువుకి 'నాట్యవేదిక'లా ఉంది.

ఏమిటిదంతా?

ఏ దుష్టశక్తి ప్రభావ మీ ఘోరదృశ్యం?

నిర్మలా!....నిర్మలా....నేను....రవిబాబుని, కళ్లతెరు....మాట్లాడు,ఏమైందో చెప్పు....ఆవేదనా స్వరంతో మీదకి వంగి మెల్లగా అడిగేను.

ఆమెలో స్వల్పంగా కదలిక. ఇనుప గోడను చీల్చుతున్నట్లు బలవంతాన కనురెప్పలు చీల్చుకుంది. నిర్నిమేషంగా నా మొహంలోకి చూసింది. వచ్చారా....రవిబాబూ?....అదృష్టవంతురాలిని. ఆఖరు క్షణాల్లో మిమ్మల్ని చూడగలిగాను. మీ స్వరం నన్నే లోకాన్నుంచి పట్టలాక్కొచ్చిందో' "ఎండిపోతున్న నాలుకని తడిచేసు కుని మళ్ళీ మాట్లాడింది.

"నాకేదో అయిందని బాధపడుతున్నారుకదూ మీరు? నిజానికి నాకు జరిగిన దానికన్నా ఘోరం ఆ తలుపుకవతల ఉన్న కార్మికులకి జరిగింది. ఆ కటిక పేదల కడుపులకి జరిగింది. మీకు సూచనగా చెప్పాను-రవిబాబూ! వాటాలు పంచుకోవ టంలో మా ఫాక్టరీ ఒక కిరాతకుడి చేతికి వచ్చిందని, అతను చేయగలిగిన ఘోరాలన్నీ చేసాడు. ప్రమాదంలో చేతిని పోగొట్టుకున్న 'వదలి'ని నిర్దయగా తొలగించాడు. ప్రసూతితో కదలలేని స్థితిలో పచ్చిబాలింతరాలై ఉన్న తరుణంలో పనికిరాలేదన్న నేరంతో మరో స్త్రీని బర్తరఫ్ చేసాడు. కంటికి నచ్చిన ఆడ కూలీల జీవితాలతో

అడుకున్నాడు. చివరికి గంజి దొరకని రోజుల్లో 'బోనసు' పద్ధతి తీసేసి జీతాలు తెగ్గోయడంతో ఎదురు తిరగక తప్పలేదు.

నా నాయకత్వాన్ని గర్హించాడు. నా అంతం చూస్తానన్నాడు. నిన్న పది మంది రాక్షసులకి నా సర్వస్వం ఆహారమైంది! పరిసరాల నుండి, రాక్షస ప్రవృత్తితో మనిషి తోలుకప్పుకున్న మృగాలనుండీ, రక్షణలేని జీవితాలు మావి రవిబాబూ! మా పేదవాళ్ళకోపాలు పెదవులకే కాదు ప్రాణాలకే చేటు.

ఈ దేశంలో 'అగ్నివర్షం' కురవాలి. అవని మీద పాపాల నెలవులు భస్మం కావాలి. అప్పుడే శాంతి. అప్పుడే మరో సూర్యుడుదయిస్తాడు. "లావా" ప్రవాహంలాగ సాగిన 'ఊపిరి' ఆగిపోయింది.

ఆమెలోని జ్యోతి ఆరిపోయింది.

ఆ 'మృతజీవి'కి చేతులు జోడించాను. బయట కూలీలకు వర్తమానం అందిన సంకేతంగా శోకాల ఘోష, ఆమె పెదవులమీద గడ్డకట్టిన నెత్తురు, 'రంగుల చిత్రం'లా ఆ 'పేదపెదవి'ని కౌగలించుకుంది. ఆ ఎరుపులో ఎన్నో సందేశాల రంగులు.

నర్సు ఆమె మొహం దాకా తెల్లగుడ్డ కప్పింది.

విప్లవసంకేతం - [illegible]

---

# చేప కథ... చీమ కథ...

—శ్రీపతి

అనగా అనగా ఒక చేప. వయసులో ఆ చేప స్వతంత్ర భారతదేశమంత చిన్నది. ఎండలో ఎండవేసినా ఎండలేదు. కుళ్ళిపోయింది. వలపన్ని పట్టితెస్తే చివరికి ఎందుకూ పనికిరాకుండ పోయింది. కంపు కొట్టుతున్నది. దాంతో చుట్టూ వాతావరణమంతా చెడిపోయింది.

కొందరు ప్రెస్ రిపోర్టర్స్ వచ్చి చూసారు. ఆ చేపకి మందుల్లేవు. హాస్పిటల్స్‌లో ఖాళీ బెడ్స్ లేవు. డాక్టర్లు కూడా లేరు.

ఎందుకు ఎండలేదని అడిగారు.

ఈ ఇరవై రెండేళ్ళ కాలంలో తనసంగతి ఎవ్వరూ ఎప్పుడూ పట్టించుకోలేదని చెప్పింది. అసలు గాలిలోకి వెలుగులోకి తీసుకురాలేదని చీకటిలో జైళ్ళల్లో ఉంచారని మొరపెట్టుకుంది. రెల్లుదుబ్బును చూపింది.

రెల్లుదుబ్బుకు రంపాల్లాంటి లెక్కలేనన్ని చేతులున్నాయి. బాయినేట్ల్లా పొడుచుకు నుంచున్నాయి. పదునుగా మెరుస్తున్నాయి. ఆ రెల్లుదుబ్బు తనచేతుల్లో శాసనాలని పెట్టుకుంది. ఆ చేతుల్తోనే అది మతాలని పట్టుకుంది. ఆ చేతుల్తోనే అది దేవుళ్ళని పూజిస్తున్నది. అది ఆ చేతుల్తో బడాపెట్టుబడి దారుల ఇళ్ళముందు స్టెన్‌గన్‌లతో కాపలా కాస్తున్నది ఆ చేతుల్తో అది భూస్వాములకు వారసత్వపు హక్కులను ప్రసాదిస్తున్నది. ఆ చేతుల్తో అది దళారుల పక్షాన కోర్టులో తీర్పులు రాస్తున్నది. ఆ చేతులే సామ్రాజ్యవాదుల మెడలో పూలహారాలను వేస్తున్నాయి.

ఆ రెల్లుదుబ్బు వీచిన తుఫాన్ గాలులకు విరగలేదు. వచ్చిన పెద్దపెద్ద వరదలకు అది పొరగలేదు. గాని రాజ్యాంగం వేళ్ళతో మట్టిలో బలమైన పునాదులు తవ్వింది. ఆ చుట్టుపక్కలెక్కడా మానవత్వపు మొక్కలు కూడా మొలవకుండా అధికారాన్ని చెలాయించుకొస్తున్నది.

'చేపకి ఎందుకడ్డమొచ్చావు?' ఒక విలేఖరి అడిగాడు. ఒక విదేశీ పత్రికా విలేఖరి క్లోజప్‌లో ఫొటోలు తీసాడు.

'నా సీటిలో దాన్నితెచ్చి వేసారు. నేను అడం రావడ మేమిటి? అని రెల్లుదుబ్బు 'నా గుడారంలో తల పెట్టింది. నా అనుమతి లేకుండా అమెరికా ఖండాల్లో క్యూబా పేరుతో ప్రవేశించినట్టుగా వచ్చింది' అని విషయాన్ని తారుమారు చేయటం మొదలు పెట్టింది రెల్లుదుబ్బు.

మరో విలేఖరి 'వీత్నాంలో అమెరికా ప్రవేశించినట్టుగా-' అని ఇంకా చెప్ప బోతుండే సగంలో అందుకుని

'ఎంత మాత్రమూ కాదు' అని తోసిపుచ్చింది రెల్లుదుబ్బు.

'అరబ్ దేశాల్లోకి ఇజ్రాల్ వచ్చినట్టుగా కాదా?' అని అదే విలేఖరి మళ్ళీ అడిగాడు.

ఆ ప్రశ్నకు సమాధానం చెప్పలేదు. రెల్లుదుబ్బు విషయాన్ని మార్చింది. వెళ్ళి ఆవు నడగండి అంది. ముఖం తిప్పుకుంది.

* * * *

ఆవు దగ్గరకు వచ్చి మూగారు విలేఖరులు.

ఆవు అమాయకంగా ఉంది. రాటకి కట్టిపడ్డేసారు. తిండ్లేదు. ఎముకల గూడులా వుంది. ఆ రాటనించి తెంచుకొని పారిపోవాలని గింజుకుంది. కాని రాట బలంగా ఉంది. మెడకి ఉన్న కన్నె ఇంకా బలంగా ఉంది. ఎంత ప్రయత్నించినా మెడకోసుకుపోతున్నదే తప్పించి రాట కదలటంలేదు. కన్నె తెగటం లేదు.

ఆవు వంగుకుని ఉన్నది. విలేఖరుల గొడవకి కళ్ళు తెరిచింది.

'మీరు నిరాహారదీక్ష చేస్తున్నారటకదా? ఎందుకు? అని ఒకాయన అడిగాడు. విలేఖరులు వెళ్ళే పని ఒకటయితే చేసే పనులు పది.

'అవును తిండిపెట్టమని చేస్తున్నాను.'
నవ్వారు కొందరు. తిండికోసం నిరాహారదీక్ష పూనటం బావుందనుకున్నారు.

'తిండిపెట్టడం మళ్ళీ యాచించటం దేనికి? మీరే పండించుకోక, పంటలను తెచ్చుకోక.'

'అదెట్లా అవుతుంది నాయనలారా. పైన పెద్దవాడున్నాడు. వాడిచేతితోనే

అంతా జరగాలి. వాడి దయగలిగి-'

'మీ అంతట మీరు-శక్తితో సాధించుకోరన్నమాట.'

'ఎక్కడ అడుగుపెట్టే ఎవరూరు కుంటారు? ఎక్కడ అడుగు పెట్టినా అది ఎవరిదో ఒకరి ఆస్తి అయ్యే ఉంటుంది. ధైర్యంగా అడుగు వేసామూ అంటే అది బందెల దొడ్డికి తిన్నగా తీసుకుపోతుంది తప్ప-'

'ఆ రెల్లుదుబ్బులున్నాయి కదా వాటిని తినొచ్చుకదా? మీరెందుకు వాటిని తినేయలేదు.

'దాన్ని నేను తినలేను. అది చేతగా ఉంటే ఏమో! అది బలిసింది. దాని రేకులు ఇప్పుడు రంపాల్లాగ ఉన్నాయి' నా నాలిక పెదాలు తెగిపోయి రక్తం కారుతుంది తప్పించి దాన్ని తినటం నాకు చేతకాదు.'

'కోసి ముక్కలు ముక్కలు చేసి తినొచ్చుకదా?'

'అమ్మో రక్తం నా అంతరాత్మ ఒప్పుకోదు' అంది ఆవు.

'మీ ఎరువుతో తెగ బలుస్తున్నది కదా, మీరు ఇవ్వటం మానేస్తే అదే చస్తుంది తిండిలేక' అన్నాడు ఇంకో విలేఖరి.

'నేను చేయగలిగింది ఏమీలేదు, పోయి కాపరినడగండి. నేను నీరసంగా ఉన్నాను. నన్ను ఇంక మాటాడించకండి' అంది.

* * * *

విలేఖర్లను చూడటంతోనే చాల మర్యాద చేసాడు కాపరి. వినమ్రతగా చూసాడు. ఆ ప్రవర్తన చూసి కొందరు కాపరి చాలమంచివాడు అన్నభావాన్ని ఏర్పరచుకున్నారు. కాపరి చాల హుందాగా ఉన్నాడు.

'ఆవును కట్టిపడేశారట తమరు. అంతా అనుకుంటున్నారు' అన్నాడు స్వదేశీ బడా పత్రికా ప్రతినిధి.

తలపాగాని సర్దుకున్నాడు. మీసాలని దువ్వుకున్నాడు. కాపరి చివరికిఅన్నాడు

'ఆవుల్ని కట్టి పడేయకపోతే విడిచేయమంటారా? ఈ పంటలన్ని ఏ మవుతాయి, ఒక్క గింజన్నా గోడౌన్స్‌లోకి వస్తుందా? బ్యాంకు స్టాక్ఎక్స్చేంజిలూ మన

గలుగుతాయా? ఆవు మీద జాలి చూపిస్తున్నట్లున్నారు మీరు, కొంచెం కట్లువిప్పి విడిచి చూడండి. మీకే తెలుస్తుంది. ఈ పంటంతా తనదే అంటుంది, ఎదురడ్డమొచ్చిన వాడినెల్లా పొడిచి చీలుస్తుంది, అది పశువు సార్, దాని బలము తెలుసుగనకనే రాటకి కట్టాము. అది క్రూర మృగం అని తెలిస్తే బోనులో పెట్టేవాళ్ళం. గడ్డిదుబ్బను తినమని విడిచిపెత్తే పంటల్ని తినేయకుండా ఊరుకుంటుందా? అంచేత'

'ఆవును గూర్చి తమరు అట్లా మాట్లాడటం బాగాలేదు. అది సాధుజంతువు తన ఆకలి తీరిందంటే దానికి అమృతం పెట్టినా అక్కర్లేదు. రేపటికోసం దాచుకోదు' అన్నాడు ఇంకో విలేఖరి మధ్యలో తలదూర్చి.

'లాఠీలు, తుపాకులు, కోర్టులు, జైళ్ళు ఉన్నాయి గనకనే అవి సాధువుగా కనబడుతున్నాయి. మంచితనమంతా కనిపిస్తున్నది. ఈ మంచితనమంతా చూసిన తర్వాతనే రాటలూ కొన్నె కర్రలూ పట్టుకొచ్చింది. పైసలు మిగిలి కాదు వాటిని తెచ్చింది' అన్నాడు పసులకాపరి. భుజం మీది నక్షత్రాలని చంకలోని కర్రనీ సర్దుకున్నాడు.

'ఇకవాలు:నన్నంటే ఏం లాభం. నేను కూడా మూడుపూటల తిండికి ఆశపడి ఇది దాపుందనుకున్నాను. ఈ కర్రను చంకను పెట్టుకున్నాను. పోయి నాకు కూడుపెట్టున్న అవ్వని అడగండి. ఆ అవ్వ చెపుతుంది.

* * * *

పార్లమెంటు సభ్యులంత హోదాతో వచ్చారు విలేఖర్లు అవ్వదగ్గరికి.

అవ్వ ఇంటిబయట నెత్తిన చేతులు పెట్టుకుని కూచుని ఉంది. ఆ వాకిట్లో ఇంట్లో చిందరవందరగా చాలా వస్తువులు పడున్నాయి. పెట్రోల్ డబ్బాలు అగ్గిపెట్టెలు,నెత్తురులోమునిగినమతాలకత్తులు, సత్యాగ్రహాలబోర్డులు, నిరాహారదీక్షల బేనర్లు నాటుబాంబులు, చించేసిన జెండాలు, కాల్చేసిన చరిత్ర గ్రంథాలు, కాళ్ళు విరిగిన కుర్చీలు నేలవాలిన మైకులు, తెగి వేలాడుతున్న ఎలక్ట్రీ తీగెలు, విరిగి ముక్కలయిన టెలిఫోన్లు, చదరంగం బోర్డులు, లాటరీ టికెట్లు విదేశీ కరెన్సీలు, తెంచిన తోరణాలు, నేలకేసి కొట్టిన ఎలక్ట్రీ దీపాల పెంకులు, పేడపులిమిన దేశీయ నాయకుల వాల్‌పోస్టర్లు.

అవ్వ నూడ్‌గా ఉంది. దేశీయాభిమానం చీరకన్నా కట్టుకోలేదు.

'అవ్వా ఆ పసులకాపరికి అన్నం పెట్టలేదట' అన్నాడు ఒక గుత్తపెట్టుబడిదారి పత్రికా విలేఖరి. ఇంటర్వ్యూ ఆరంభించాలని.

'నేను పసులకాపరికి అన్నం పెట్టలేదని చెప్పలేదు?' అని జాతీయవాది

పత్రికా విలేఖరి ఖండించాడు.

కొంతసేపు గొడవపడ్డారు. వాళ్ళల్లో ఒక స్టెనో తనురాసింది చివరికి చదివాడు.

'చేప ఎండక పోవటానికి నువ్వు కారణం అంటున్నారు. నీవేమంటావు? అన్నాడు, ఒక పెద్దమనిషి.

అవ్వ రొమాంటిక్‌గా ఉంది. గ్లామర్ ఉట్టిపడుతున్నది. దాంతో సమ్మోహితులయి పోయారు. ఫొటోగ్రాఫర్స్ చుట్టుముట్టేసారు. ఒక ఆర్టిస్ట్ జర్నలిస్ట్ స్కెచెస్ వేయటం మొదలు పెట్టాడు.

మళ్ళీ అడిగాడు 'ఆవులకాపరిని విడవ లేదటంగా ఎందుకు?' అని అతివాది పత్రికా విలేఖరి.

నోరు మెదపకుండా, కళ్ళతో కనీసం చూడనన్నా చూడకుండా, ఎడంచేతి చూపుడు వేలుతో చంటిపాపని చూపింది అవ్వ.

ఎవ్వరూ కదలరు. అవ్వ ఎదుట కూచున్నారు. అవ్వ మాటాడుతుందని చూస్తున్నారు. సినిమాల్లో ముద్దులుండాలా వద్దా అన్న ప్రశ్న ఒకాయన తయారు చేసుకున్నాడు. వొక ముసలి రిపోర్టర్ మాత్రం అక్కణ్ణించి కదిలాడు.

*    *    *    *

చంటిపాప ముఖాన కళ్ళులేవు. వికారంగా కనిపించింది. గుడ్డి కళ్ళన్నా ఉంటే బావుండును. ఆ కళ్ళున్న భాగాన ముఖంలో బుగ్గఎముక ఎత్తుగా ఉంది. అంతే కనుబొమలు కూడాలేవు. మెలికలు తిరిగిన చెట్టు వేళ్ళలా వొట్టి ఊసకాళ్ళు. వొళ్ళంతా పసి కారుతున్నది. చేతివేళ్ళు తెగిపోయాయి. కుష్టు. చూస్తే పాపలా కనిపించదు. మరుగుజ్జులా ఉంది.

'నీ వయసెంత?' అని అడిగాడు. మొదట వయసు తెలిస్తే ఆరోగ్యం సంగతి నిర్ధారణ చేసుకోవచ్చనిపించింది.

చెప్పలేదు.
నీ పుట్టినతేదీ చెప్పు.
'రిపబ్లిక్ డే నాడు పుట్టినా' అంది.
'మరి ఇన్నేళ్ళయిందే నీ ఆరోగ్యం అలా ఉందేం? మరుగుజ్జువా?' అన్నాడు.

'నా తల్లీ తండ్రీ మరుగుజ్జులు. నేను కాకేమవుతాను. వాళ్లు మూగాల బిచ్చగాళ్ళు. నా తండ్రికి కుష్టు. తల్లికి సవాయి. నా తల్లికి కళ్ళులేవు తండ్రికి కాళ్ళులేవు. వాళ్ళ సంతానాన్ని.'

'అవ్వ నీ తల్లి కాదా?'
మూగాల పుట్ట నోరు కదపలేదు.
'సరే ఎందుకేడుస్తున్నావ్?'
చీమని చూపింది.

*   *   *   *

ఆ పొక్కుడే చీమ దగ్గరికి వచ్చాడు.
చీమ చాల గిజీగా ఉంది.

'ఎందుకు కుట్టావ్?' అన్నాడు. ప్రభుత్వమంత విరాటాకారంతో చీమ ముందు నుంచుని.

చీమ మొదట చెవిపెట్టుకోలేదు. మళ్ళా దారికడ్డమొచ్చి అడిగేసరికి 'నువ్వెవడివి?' అని కసిరి అడిగింది.

చీమని భయపెట్టి హడలెత్తించేయాలనిపించింది విలేఖరికి.
'నేను స్వేచ్ఛని' అన్నాడు,
'అయితే మీ దేశం?'

స్వేచ్ఛకి విశ్వమంతా దేశమే అని చెప్పాలనుకున్నాడు గాని పౌరసత్వాన్ని శంకిస్తుందేమోనని అనుమానం కలిగి 'భారత దేశం' అన్నాడు.

'మీ దేశం విదేశాలను అడుక్కుంటున్నదట ఎందుకు? పేదరికం ఎక్కువయిందట ఎందుకు? ధరలు పెరిగాయట. కాంగ్రెస్ సగందేశంలో చచ్చిందట ఇవన్నీ ఎందుకు ఎందుకు?

ప్రశ్నలు వేయాలన్న కీవితోనే వచ్చాడుగాని-ఎదురు ప్రశ్నలకు సిద్ధపడి రాలేదు విలేఖరి.

'రాజ భరణాలు రద్దు చేయలేదు ఎందుకు? విదేశీ బ్యాంకులు జాతీయం చేయలేదు ఎందుకు? ఆదాయం పన్ను వసూలు చేయలేదు ఎందుకు? స్వేచ్ఛాజీ చెప్పండి',

గాల పుట్టకి మీరు కిరీటం పెట్టి పూజిస్తున్నారు. దాని రోగాలు వ్యాపించి జాతిజాతంతా నాశనమవుతున్నది. ఆ రోగాల పుట్టని చంపటానికి నా శక్తులు అక్కర్లేదు, ఆ రోగాలతో కుళ్ళి దానంతటదే చస్తుంది. కాని నా అమాయకమైన జాతిని నాశనంచేయకుండా, నేను రక్షించుకోవాలి. ఆ రోగాలు ఇంకా ఇంకా బలిగొనకుండా, వ్యాపించకుండా ఎదురుదాడులతో నివారిస్తాను. నా కండరాల శక్తితో బలమైన జాతిగా కాపాడుకుంటా' అని చెప్పింది చీమ.

# హత్య

— వెంపాశా

శ్రీపతి ఆఫీసునుండి రాగానే కారు 'గరాజ్' లో ఆపి, అక్కడే బరువుగా ఉదయం నుండి తనను అంటిపెట్టుకున్న కోటుసూ, శివుని మెళ్ళో వేళ్ళాడుతున్న పాములాంటి తన 'టై'ని తీసేసి బుజాన వేసుకుని తిన్నగా ఇంట్లో అడుగు పెట్టేడు. ఇంట్లోని వాతావరణం 'పంకజ' చాలా బిజీగా ఉన్నట్లు కన్పిస్తోంది. విడిచిన చీరె, జాకెట్టూ ఒక మూలగా విసిరేసి ఉన్నాయి. డ్రాయింగ్ రూములో పత్రికలు, పుస్తకాలు చిందరవందరగా పడేసి ఉన్నాయి. సోఫా సెట్టూ కుర్చీలు మామూలు స్థానాల్లో లేవు. డ్రెస్సింగ్ టేబిల్ యుద్ధరంగంగా ఉంది. నైయిల్ పాలిషూ, క్యూటెక్సు, డ్రీమ్‌లాండ్ పౌడరు డబ్బా, దువ్వెనా, హేరాయిలు, బ్రష్, హెయిర్‌పిన్నూ ఇంకా అనేకం సౌందర్యోపాసనకు సంబంధించిన వస్తువులు యుద్ధంలో దెబ్బతిన్న సైనికుల్లా 'టేబిల్' నిండా ఆవరించి ఉన్నాయి. 'షూరేక్' అంతా చెల్లా చెదరుగా ఉంది రంగురంగుల 'హైహీల్స్ షూస్' ఒకటి కిందా, ఒకటి వెనకాలా వాటి ఇష్టమొచ్చిన స్థానాల్లో అవి ఉన్నాయి. 'రేడియోగ్రామ్' అంతవరకూ అరచి అరచి సొమ్మసిల్లినట్టుగా ఉంది. రికార్డులన్నీ పక్కనే చీకటి సున్నాలు విస్తరించినట్లుగా ఉన్నాయి.

శ్రీపతికి ఇదేం కొత్తగాదు. పంకజ ఎక్కడికెన్నా ప్రయాణ సన్నాహం లో ఉన్నప్పుడు మామూలుగా ఉన్న హంగామా ఇది. వంట ఇంట్లో 'నాయర్'తో ఏదో పెద్దగా కేకలు వేస్తోంది.

శ్రీపతిని చూడగానే 'హలో హనీ! అనుకుంటుండగానే వచ్చేశారు. హండ్రెడ్ ఇయర్స్! మీకు.' అంటూ పలకరించింది. శ్రీపతి కొంచెం సేపు మౌనం.

“ఈ రోజు పెర్సీస్‌లో రిపబ్లిక్ డే డ్యాన్స్ ఉంది. మేజర్ కపాడియా ఫోన్ చేసేడు. టేబిల్ రిజర్వేషన్ కూడా చేసేడట. కలకటా నుండి రీటా వస్తోంది డ్యాన్సుకు. జాజ్....ఇంకా ఎన్నో 'ఇంటరెస్టింగ్' ఐటెమ్స్ ఉన్నాయి. త్వరగా రెడీ అవండి....ఆ....అన్నట్టు....మీకు కపాడియా రెండుసార్లు ఫోన్ చేస్తే మీరు దొరక లేదట....లైన్ ఎంగేజ్డ్ అన్నాడు....ఇవ్వాళ 'రెడ్డీస్' కూడా వస్తున్నారు.” -ఇలా పంకజ చెప్పుకు పోతోంది.

శ్రీపతి మళ్ళీ కొంచెం మౌనం...."ఈ రోజు ఎందుకో రావాలని 'మూడ్' లేదు. ఈ మధ్య మొదలెట్టిన నవల నాల్గో అధ్యాయంలో ఉండి పోయింది. ఈ రోజు మళ్ళీ వ్రాద్దామనుకుంటున్నాను." అన్నాడు నెమ్మదిగా శ్రీపతి.

"అస్తమానమూ ఆలోచిస్తూ ఈ రచనలు చేసి ఎందుకు బుర్ర పాడుచేసుకుంటారు....అలా బయటకు వెళ్ళి కొంచెం రిలాక్స్ అవుతే బావుంటుంది. మీకు మెంటల్ స్ట్రెయిన్ బాగా ఎక్కువైపోయింది-నామాటకాదనక త్వరగా 'డ్రెస్' అవండి".

ఇంతలో నాయరు 'టీ' ట్రేలో తెచ్చి ఉంచాడు. శ్రీపతి సిగిరెట్టు వెలిగించి 'టీ' నెమ్మదిగా సిప్ చేస్తూ....'ష్యూరే'....అన్నాడు పొడిగా. చంచల అప్పటికే 'డ్రెస్' అయి రెడీగా ఉంది.

'పెర్సిస్' లో రెడ్డి దంపతులూ, మేజర్ కపాడియా, శ్రీపతీ, చంచలా కలుసు కున్నారు.

'లాన్' లో మూలగా మంచి స్థానంలో టేబిల్ రిజర్వ్ చేయించుకున్నారు బేరర్ ఎటెన్షన్‌లో నుంచుని కపాడియా వైపు చూస్తున్నాడు.

"శ్రీపతీ....అలా మౌనంగాఉన్నారు....ఏంకావాలో శలవియ్యండి"అన్నాడు కపాడియా.

"బీర్....త్రీ ఈగిల్స్"

"నోనో....బీరేమిటి....పరమాన్నంలా కడుపులో బరువుగా ఉంటుంది.... మజాలేదు.... "అని కపాడియా అంటూండగానే 'వైట్ నాట్ విస్కీ' అన్నాడు రెడ్డి. విస్కీ అయితే "స్కాచ్" కావాలి అన్నాడు కపాడియా.

"మరి లేడీస్ కో" అన్నాడు రెడ్డి.

'మాకు మామూలు జిమ్‌లెట్ ఉందిగా'అన్నది చంచల. మిసెస్‌రెడ్డి నవ్వింది ఈ రోజు మనం మానేయ గూడదూ? అంటూ-అందరూ నవ్వేరు. ఇది మామూలే. ఒకరు కావాలనటం మరోరు వద్దనటం అందరూ నవ్వటం చివరకు అందరూ గ్లాసులు కలపడం.

"ఐస్ క్యూబ్స్" అంటని గ్లాసుల్లోనూ వేస్తూ చెంచల-కపాడియా వైపు చూస్తూ మరో రెండు క్యూబ్‌లు ఎక్కువ వేసింది అతని గ్లాసులో. కపాడియా రిస్ట్

వాచి తళతళ మెరుస్తూ చంచల దృష్టిని ఆకర్షించింది. ఇది బావుంది అన్నట్టు ఈ వాచ్ మొన్ననే తెప్పించాను. జపాన్ ది, ఆటోమేటిక్, స్మగుల్డ్ సరుకు. కలకత్తా నుండి ఎవడో పట్టుకొచ్చేడు,' అన్నాడు కపాడియా. ఆ వాచ్‌ని చేత్తో ఒకసారి చూసి లవ్‌లీ వాచ్ అన్నది చెంచల.

త్రీ చియర్స్...అని అందరూ గ్లాసులు ఎత్తేరు. కపాడియా గ్లాసు చెంచెల గ్లాసుకు అంటించేడు. బేరర్ చిప్సూ, కాష్యూనట్సూ తెచ్చి బల్లమీద ఉంచేడు. రెడ్డి సిగిరెట్టు ముట్టించేడు...అతని 'బ్రేండ్' పెనామా.

'రెడ్డీ...మీరు మా సిగిరెట్ రుచి చూడాలి అంటూ కపాడియా...'త్రీఫైవ్స్ కింగ్‌సైజ్...ఒకటి ఆఫర్ చేసేడు. శ్రీపతికి కూడా ఒకటి అందించి తను వెలిగించుకుని అందరిసిగరెట్సూ వెలిగించేడు. చెంచల చిప్స్ చిటచిట లాగిస్తూ. 'త్రీఫైవ్స్' పెట్టి చాలా అందంగా ఉంది సిగిరెట్టులాగే అంది. కపాడియా డ్రెస్‌లోనూ, హైర్ స్టెయిల్‌లోనూ...సిగరెట్లలోనూ....సాక్సులోనూ,టైలోనూ, బూటులోనూ చాలా అప్టుడేట్‌గా ఉంటాడు. నీట్‌నెస్ అతని ప్రత్యేకత. 'స్మార్ట్' అనే పదానికి అతనే నిర్వచనం, అతను 'సాక్స్' గురించి చెప్పడం మొదలుపెడితే చిన్న ఉపన్యాసం అవుతుంది. ఫారిన్ సాక్సుకూ ఇండియన్ సాక్సుకూ తేడా టెక్నికల్‌గా విడమఱచి ఒక 'థీసిస్' లాగా చెప్పుకుపోతాడు. రంగుని బట్టి ఏ బ్రాండు విస్కీ అయిందీ ఇట్టే చెప్తాడు. దేశదేశాల 'బీర్స్'ను గురించి క్షుణ్ణంగా తెలుసు. జపనీస్ బీర్ అంటే అతనికి చాలా ఇష్టం అది సూర్యాగి మార్కుది దాంట్లో బోలెడంత ప్రత్యేకత ఉంది అంటాడు.

విస్కీ రెండోరౌండ్ నడుస్తున్నది. సంభాషణ ఇటీవల జరిగిన బ్యూటీ కంటెస్టును గురించి జరుగుతోంది. పోటీకి వచ్చిన పందొమ్మిదేళ్ళ అమ్మాయి నళినిని గురించి వర్ణిస్తున్నాడు కపాడియా. 'ఆమె కొలతలు స్టాండర్డ్సులో ఉన్నాయనీ..ముఖంలో చాలా గ్రేస్ ఉందనీ....ఇలా చెప్పుకు పోతున్నాడు. చెంచెల వైపు చూసి.... మీరు కొంచెం ఓవర్ వైట్....మీరు తగ్గాలి....అన్నాడు. శ్రీపతి చెంచలవైపు చెంచల శ్రీపతివైపూ....చూసుకున్నారు,

'తిండి తగ్గిస్తే బావుంటుందేమో' అని అన్నాడు శ్రీపతి.

'నేనేం తింగి పోతునా'....అని కోపంగా చూసింది చెంచెల.

'కొంచెం రిస్ట్రిక్ట్ చేసి....కొవ్వు పదార్థాలు తిండం మానేస్తే బావుంటుంది' అన్నాడు రెడ్డి.

'దేశంలో పస్తులుంటున్నవాళ్ళు చాలామంది ఉన్నారు మనకేం ఖర్మ' అంది చెంచల.

కపాడియాకు విస్కీ రుచించ లేదు. ఇది స్కాచ్ కాదు....నాకనుమానంగా ఉంది అన్నాడు.

నోనో ఇది స్కాచే....నేను పైన లేబిలో 'సీల్డ్ క్వేర్' అన్నీ చూశాను. అన్నాడు రెడ్డి.

"బ్రదర్....నీకు తెలీదు, లేబిల్ అలాగా ఉంటుంది. సీలు అలాగే ఉంటుంది. సీసాకు అడుగున ఇంజక్షన్ ఇచ్చి అసలు విస్కీ లాగేసి కల్తీ సరకు ఎక్కిస్తారు. ఇదో పెద్ద ఉద్యమం నీకు తెలీదు. కార్క్‌క్యాప్స్‌కు ఎంత డిమేండో తెలుసా బైజాగ్‌నుండి ఎగుమతి అవుతయి, కాళీసీసాలూ....కార్క్‌క్యాప్స్....ఇదో పెద్ద పరిశ్రమ." ఇలాంటి విషయాల్లో కపాడియాకు బోలెడంత విజ్ఞానం ఉంది. ఇతను చేసిన రిసర్చికి డాక్టరేట్ ఇవ్వొచ్చు....అన్నాడు.

'దురదృష్టవశాత్తు మన దేశంలో అలాంటి యూనివర్శిటీలు లేవు.' అన్నాడు శ్రీపతి. చెంచలా, మిసెస్ రెడ్డీ 'జిన్' నెమ్మదిగా సిప్ చేస్తున్నారు. విస్కీ మూడో రౌండ్ ఆయి నా గులోకి ప్రవేశించారు.

ఆరు అంకాలయినా అయితేగాని తెర పడదేమో ఇవ్వాళ....అన్నాడు శ్రీపతి.

శ్రీపతి ఇవ్వాళ మూడ్‌లో లేడు. జ్వరం వచ్చినవాడు చేదుమందు త్రాగినట్లుగా.. ముఖం పెట్టేడు. అతన్ని ఇంటి దగ్గర గాలికి రెపరెపలాడుతున్న సగం వ్రాసిన కాగితాలు పిలుస్తున్నాయి. కథ మంచి పట్టులో ఉంది. ఆలోచనలు పరుగెత్తుతున్నాయి. చెంచల కపాడియాలోని ప్రత్యేకతను ఎప్రీషియేట్ చేస్తోంది. ఆమె దృష్టిలో కపాడియా అభ్యుదయమైన మనిషి. వ్యక్తిత్వం కలవాడు. అతని బూట్సు ఎప్పుడూ పాలిష్‌తో నిగనిగ లాడుతూ ఉంటయి. ముడిగూడా చాలా ముచ్చటగా ఆర్టిస్టిక్‌గా వేస్తాడు. అతని కాళ్ళకు బూటు ఏదో అభరణంలా ఉంటుంది. 'టై' నాట్ గూడా ఎంతో నాజూకుగా ఉంటుంది. కొంచెంసేపు 'టై నాట్ వైపూ, కొంచెంసేపు అతని వాచ్‌నీ... అతని మీసకట్టునీ... పరీక్షగా చూస్తోంది. కపాడియా 'డాన్సు' బాగా చేయగలడు. ఇంగ్లీషు పాటలు పాడగలడు. ఒకరోజు 'సౌండ్ ఆఫ్ మ్యూజిక్' లో పాట పాడితే చెంచల పరవశమై పోయింది.

హాల్లో రీటా డ్యాన్స్ ప్రారంభం అయింది. మైక్ దగ్గర 'కుంబో' పాట బ్యాండ్ కూడా జతగూడినయి. కపాడియా ఆనందిస్తూ మెరుస్తున్న బూట్లతో తాళం వేస్తున్నాడు. చెంచల బల్లమీద దరువు వేస్తోంది. రెడ్డి సిగిరెట్టు పీలుస్తూ కళ్ళతో ఆనందిస్తున్నాడు. కూమన్న వాళ్ళలో ఒక్కొక్కరూ వెళ్ళి డ్యాన్స్‌లో పాల్గొంటున్నారు

శ్రీపతీ, చెంచల— మీ రిద్దరూ కూడా 'డ్యాన్స్'లో జాయిన్ అవండి.... అని హెచ్చరించాడు కపాడియా. చెంచల ముఖం ప్రసన్నమయింది. శ్రీపతివైపు చూసింది. శ్రీపతి నవల వైపు చూశాడు. కపాడియా టై సవరించుకున్నాడు. రెడ్డి రీటా వైపు చూస్తున్నాడు. మిసెస్‌రెడ్డి చెంచలవైపు చూస్తోంది. విస్కీ అయిపోయింది.

వాట్ నెక్స్ట అన్నాడు కపాడియా.

అందరూ మౌనం...బేరర్ నిరీక్షిస్తున్నాడు.

'రమ్' అన్నాడు కపాడియా. అన్నిరౌండ్లు విస్కీ అయినా 'కిక్' రాలేదు కపాడియాకు. బాగా కిక్ రావడాని ఫార్ములా తెలుసు అతనికి. మరో జిన్‌కు ఆర్డరిచ్చాడు. జిన్‌లో రమ్ కలిపితే రుచి కపాడియా కొక్కడికే తెలుసు. ఎంత ఎంత పాళ్ళల్లో కలపాలో తెలుసు. దీనిని గురించి ఒక అరగంట ఉపన్యాసం యిచ్చాడు. కపాడియాకున్న విజ్ఞానానికి 'హేట్స్‌ఆఫ్' అన్నది చెంచల. 'రమ్‌పంచ్' కపాడి యాకు అభిమాన 'టానిక్'. అది రెండురౌండ్లు అయిన తరువాత అతన్ని చూడాలి. చైనా సరిహద్దుల్లో ఉంటాడు. యుద్ధరంగంలో అభిమన్యుడిలా ఉంటాడు. అతన్ని గెలవడానికి ఏ పద్మవ్యూహాలూ పనికి రావు.

'రమ్‌పంచ్' అయిపోతుందేమోనని అమృతంలా కొంచెం కొంచెం సిప్ చేస్తున్నాడు కపాడియా. కూర్చునే అతని బూట్లు నాట్యం చేస్తున్నయి.

'స్వర్గానికి బెత్తెడు...నిచ్చెన అక్కర్లేదు.' అంటున్నాడు కపాడియా రెండో రౌండు పూర్తిచేస్తూ అతని గొంతులో ఒక విధమైన మాధుర్యం ఉంది. ఎక్కువ నిషాలో ఉన్నప్పుడు ఆరితేరిన వైణికుని వీణాతంత్రుల తరంగాలలా ఉంటుంది అతని కంఠధ్వని. రీటా డ్యాన్స్...జోరుగా సాగుతోంది. కపాడియాకు రెండు చెంచలలు కన్పిస్తున్నారు.

'హనీ! వై నాట్ వుయి డ్యాన్స్' అన్నది చెంచల శ్రీపతిని చూస్తూ.

"నాకు కడుపులో తిప్పుతోంది" అన్నాడు శ్రీపతి.

చెంచల కపాడియావైపు చూసింది. "గో ఎహెడ్" అన్నాడు శ్రీపతి.

కపాడియా చెంచలా ఒకరిని రాసుకుంటూ వొకరు డ్యాన్స్‌లో కలిసారు.

చెంచల నడుముమీద చెయ్యివేసి కొంచెం దగ్గరగా తీసుకుంటూ 'స్టెప్స్" వేస్తున్నాడు కపాడియా. మైక్ దగ్గర 'మ్యూజిక్' తో తాళం వేస్తున్నారు కొంచెం సేపు ముందుకూ.... కొంచెంసేపూ వెనక్కూ....వస్తున్నారు. కపాడియాకు అడుగులు తడబడతూ చెంచల మీదకు ఒరుగుతున్నాడు. చెంచల సన్నగా నవ్వుతోంది. 'మీ హనీ....మూడ్‌లో లేడేం....ఇవ్వాళ' అన్నాడు ఆమె నడుమును దగ్గరగా లాక్కుంటూ. సొసైటీ అంటే గిట్టదు. ఎప్పుడూ రచనల్లోపడి బుర్రచెడగొట్టు కుంటుంటారు. ఆయన్ని మార్చడం కష్టం అన్నది అతని భుజం మీద చేతిని బలంగా నొక్కుతూ.

"యూ ఆర్ ఎన్ఏంజల్" అన్నాడు కపాడియా.

డ్యాన్స్ ముగిసింది. రీటాకూడా అలసిపోయి రూమ్‌లోకి వెళ్ళిపోయింది

రిపబ్లిక్ డే హాపీగా గడచి పోయిందన్నాడు రెడ్డి. శ్రీపతి కూడా వండర్ ఫుల్ అన్నాడు. అందరూ టాటా చెప్పుకుని కాందిశీకుల్లా తిరుగు ప్రయాణం అయినారు. ఆ రోజు ఇంటికి వచ్చేటప్పటికి ఒంటిగంటయింది. కారులో దగ్గరిగా జరిగి హనీ...ఆరోగ్యం బాగులేదా....అంటూ పరామర్శించింది చెంచల.

'అదేంలేదు...విస్కీ కొంచెం డోసు ఎక్కువైంది'. మూడో రౌండుతో ఆపేయవల్సింది అన్నాడు ముభావంగా శ్రీపతి.

'ఆ నవల రాయడం మానేయండి హనీ! మీకు స్ట్రెయిన్ ఎక్కువ. పైగా అదేం బావులేదు. నేను కొంచెం చదివాను.

"పూర్తి అయింతరువాత అనాల ఆ మాట."

"అసలు మీరు తీసుకున్న సబ్జక్టు నాకేం నచ్చలేదు."

"నేను సీతో ఏకీభవించను."

"మీరెప్పుడూ నాతో ఏకీభవించరు—నా మాటకు విలువే లేదు."

"కపాడియా వాచ్ చాలా విలువైంది."

సంభాషణ ఈ రకంగా పొడిపొడిగా సాగింది.

'మరి మీ నవలో?' అంది నవ్వుతూ చెంచల.

"అది వట్టిచెత్త" అన్నాడు శ్రీపతి.

మరెందుకు వ్రాయడం....అది వ్రాయడానికి వీలు లేదు-అని శాసించినట్టుగా అన్నది.

పూర్తి చేసి ప్రయత్నిస్తానన్నాడు శ్రీపతి.

ఇంటికి వెళ్ళింతరువాత చెరొక మంచం మీద పడుకున్నారు పక్క పక్కనే శ్రీపతి నిద్రపోతున్నట్టుగా ఆలోచిస్తున్నాడు. చెంచల నిద్రపట్టక అటూఇటూ పొర్లుతోంది. రాజకీయవేత్త పార్టీలు మార్చినట్టుగా గడియారం ఆగలేదు, వీధిలో గూర్ఖా కర్ర చప్పుడు చేసుకుంటూ నడుస్తున్న బూట్ల ధ్వని వినిపిస్తోంది. వాణ్ణి చూసి గొలుసుల్లోంచి 'స్మోకీ'ఆల్సేషియన్ అరుస్తోంది. చెంచల లేచి కూర్చుంది. డ్రాయింగ్ రూమ్‌లో టేబిల్ సొరుగులో నవలకు సంబంధించిన కాగితాలు రెపరెపలాడుతున్నయి-కాగితాలలో తన ప్రతిబింబం, తనను హేళన చేస్తున్నట్లు, తనను చూసి పరిహసిస్తున్నట్లు తనను సూదితో పొడిచినట్లు చేతులు చాపుతూ ముందుకు వస్తున్నయి. చెంచల అమాంతం లేచింది. సొరుగులో చెయ్యి పెట్టింది. కాగితాలు తేళ్ళా, పాముల్లా....తగిలినై విదిలించుకున్నది. మళ్ళీ చెయ్యి....ఈ సారి కాగితాలు వేడిగా....కొరివి దయ్యం చింతనిప్పుల కళ్ళలా మెరిసినై. రెండు చేతుల్తోనూ కాగితాలను తీసుకుంది. పసిపిల్లవాడి పీక నులిమేసినట్లు....పిప్పి పిప్పి చేసింది. హత్య చేస్తే రాలిన ప్రతి రక్తపు చుక్కకూ ప్రాణంవచ్చి లేచి రూపం పెంచుకొని ఎంత మందిగానో కన్పడ్డారు చెంచలకు. కాగితం ముక్కలు చెల్లాచెదరై ఇంటినిండా తెల్ల రక్తం చుక్కల్లా వ్యాపించినై. కాగితాల రక్తపు మడుగులోంచి బయటపడి....తనచీర మీద అంటుకున్న కొన్ని ముక్కలను విదిలించి వేసి....తన పక్కమీద వాలింది. బరువైన శరీరంతో తేలికైన మనసుతో,

నిద్రపోతూ ఇదంతా గమనిస్తున్న శ్రీపతి....నన్ను చంపినా బావుణ్ణు అనుకున్నాడు!!!

దగ్గరకు జరిగి....చంచలా నీకిప్పుడు హాయిగా ఉందా....అన్నాడు.



# "మురికి"

— వి. రాజారామమోహన్ రావు.

ఆ పెద్ద తూముదగ్గర ఆ మురిక్కాలవ కొంచంకిందకి దూకుతుంది. అంత వరకు తనతో బరువుగా తెచ్చుకున్న బురదని అక్కడ వదిలేయాలని మరీ తొందరగా పారుతుంది. ఆ తొందరలో గట్టుమీద కూచుని పిల్లలు విసిరే చిన్నచిన్న పెంకుల్ని, రాళ్ళనికూడా కొంతదూరం మోసుకు పోతుంది.

అలా...రాళ్ళు విసిరే ఆ పిల్లలకి అది కుళ్ళని, ఆ కుళ్ళు చుట్టూ ఉండే వాసన వాళ్ళకి తెలియకుండానే వాళ్ళల్లోకి చేరుతోందని తెలియదు. ఇంకా....

ఆ పిల్లల తల్లులు, తండ్రులూ, బామ్మలు, మామ్మలు. వాళ్ళలో కొందరికి తమచుట్టూ మురికుందని అదే తమ బతుకుల్ని పాడు చేస్తోందని తెలుసు. మరికొంద రికి మురికి ఉందని మాత్రమే తెలుసు.

అందరికీ అలవాటయి పోయింది ఆ కుళ్ళు. ఆ వాసన వాళ్ళ ఊపిరిలాగే సహజమైపోయింది. అప్పుడప్పుడు ఆ వాసన మరీ బలంగా చెలరేగినప్పుడు వోసారి ఆ వాసనకి గుడ్డపెట్టుకుని మళ్ళీ తర్వాత తీసేసి...

మురికి కాలవగట్టు మీదున్న ఆ పాకలన్నింటికీ రోజు అలాగే గడుస్తోంది చాలా రోజుల్నుంచి.

ఆ వేపునుంచి తూములో దూరి వెచ్చబడిన గాలి, కాలవమీద తేలి, ప్రతి రోజూ ఏదో సమయంలో ఆ పాకల్ని పలకరించి విశేషాలడుగుతుంది.

చీకి, చివికిపోయి....తమమీద బలంగా పేరుకున్న దుమ్ము బలంతో నిలబడ్డ ఆ పాక కప్పులు ఆ నాటి విశేషాలు చెప్తాయి ఆమురికి గాలికి.

* * * *

జబ్బుగా ఉన్న ఆ పాకలోకి జబ్బుకు భయపడి పిరిగ్గా, మెల్లిగా దూరింది మురిగ్గాలి.

ముడుచుకుని ఇసికలో ఎండుకొబ్బరాకులా పడుకునుంది చాపమీద ముసల్ది. "మందు తెచ్చినా తాగవే" అన్నాడు ఆ చాప ఓ చివర్నించి రాములు.

ముసల్ది వింది. కాని విననట్టే కదలకుండా పడుకుంది. ఓరగా కళ్ళుతెరిచి చూసింది. సీసాలో పల్చటి కుంకంనీళ్ళలా మందు....ఈమందుపేరు తెలియకపోయినా అదేమిటో తెలుసు ముసల్దానికి. కడుపులో నెప్పంటే ధర్మాసుపత్రిలో అందరికీ పోసే మందది. తన యాభై ఏళ్ళ జీవితంలో చాలాసార్లు తాగింది. అది పనిచేసినా, చేయక పోయినా అదంత మంచి మందు కాదని ఓ నమ్మకం ముసిల్దానికి.

"లేవే" అన్నాడు సీసా ముందుకి అందిస్తూ రాములు.

రాములు చెయ్యిచ్చుకుని నెమ్మదిగా లేచింది.

"ఒరే రాములూ....ఈ నెప్పి ఈ పాలి తగ్గేలా లేదు. ఈ మందు ఎంత తాగినా ఇంతే. ఆ పక్కీధి డాటరుబాబు దగ్గర సూదిమందు ఇప్పియ్యిరా" అంది మళ్ళ కిందకి వొరుగుతూ.

కొడుకుతో ఇంకా చాలా చెప్పాలన్నుంది ముసిల్దానికి. కాని ఓపిక లేదు.

రెండురోజులుగా ముసలితల్లి చెప్తున్నది వింటూనే ఉన్నాడు రాములు. వెంటనే నెప్పి సూదిమందుకే తగ్గుతుందని ముసల్దానికున్నంత నమ్మకం లేక పోయినా, తల్లి కోర్కె తీర్చాలనే ఉంది.

కాని....ఆ డాక్టరు సూది ఆముసలి చర్మంలో దిగ బట్టానికి....రంగు పుమి విలువగా చెలామణీ అవుతున్న ఓ కాగితం....ఓనోటు కావాలి.

'ఎలా?'

* * * *

మిగిలిన పాకల్లోకి వెళ్ళినంత చొరవగా ఆ పాకలోకి వెళ్ళాలనిపించదు కొలవ గాలికి.

ఆ పాకలో ఓ కుర్రవెధవ చదువు కుంటున్నాడు హైస్కూల్లో చేరి. పాకల సాంప్రదాయం కాదన్నందుకు వాడి మీద కోపమే గాలికి. కాని అంతకన్నా భయం. రోజురోజుకి ఎదుగుతున్నాడు వాడు....చిన్నప్పట్నించి వాడి పద్ధతే వేరుగా ఉంది. మిగిలిన పిల్లల్లా గట్టుమీదకొచ్చి రాళ్ళేసే వాడు కాదు. ఏనో రోజు తనని మెడపట్టుకొని వాళ్ళ పంచన చేరకుండా గెంటుతాడేమోనని భయం.

స్కూలుకెళ్ళి కుర్రాడు చదువు కుంటుంటే తృప్తిగానే ఉంది వెంకన్నకి,

కాని....ఆ ఒక్క రోజు. స్కూలు జీతం కుర్రాడు అడిగిన ఒక్క రోజు ఇబ్బందిగా ఉంటుంది. ఇవ్వాల్సి వొచ్చి నందుకు కాదు....వెంటనే ఇవ్వలేనందుకు. రోజంతా గొడ్డులా రిక్షా లాగిలాగి, మర్నాడు మళ్ళీ లాగటానికి రోజూ వేసుకునే మందు మానేస్తాడు ఓ వారం ఆ బడిజీతం పోగెయ్యటానికి.

ఈ సారి మందూ లేదు. రిక్షా లేదు. మూడురోజుల క్రితం అర్ధరాత్రి చీకట్లో బోల్తా పడి రిక్షా విరిగింది.

కుర్రాడు నసుగుతూనే అడిగాడు తండ్రిని జీతం డబ్బు.

కోపం వచ్చింది వెంకన్నకి....చేతకాని తనంగా గడుస్తున్న రోజుమీద, బండి విరిగినంత మాత్రంలో తనమీద నమ్మకాన్ని కాదన్న యజమాని మీద.

'ఎంత తిరిగినా....ఎక్కువ కిరాయి ఇస్తానన్నా వేరే బండి దొరకలేదు.... ఏం చేయాలి. కుర్రాడి మీద, వాడి చదువుమీద ఉన్న ఆశ ఇంతటితో....'

* * * *

ఆ పాకంటే హుషారు కాలవకి.... గట్టుకి మరీ దగ్గరగా ఉంటుందని....ఆ పాకలో యవ్వనం ఇంకా చచ్చి పోలేదని...

అప్పలసామి తూర్పెళ్ళి పెళ్ళి చేసుకుని పెళ్ళాన్ని తీసుకొచ్చి యాడాది కాలేదింకా....

అందుకనే కాలవకి సరదా. తొంగిచూస్తుంటే అప్పుడప్పుడు వాళ్ళసరసాలు కళ్ళ బడతాయి. అదే ఆశతో కొంచం పైకెగిరి తనంతగా తను వెళ్ళలేక గాలిని పిలిచింది సాయం.

గోముగా అప్పలసామి వీపు మీదుంది లచ్చి.

"రెండొద్దుల్లో పెద్ద పండగంట" అంది.

అప్పలసామికి ఇదివరకంత ఉత్సాహంగా లేదు. సరైన బతుకుతెరువు లేదు. పనికోసం తిరగటం, తిరగ్గాతిరగ్గా దొరికిన చిల్లర పనుల్తో ఒంటి అలసట. శరీరంలో నరాలకి బలమైన తిండిలేక నీరసం....వీటన్నిటికన్నా పెళ్ళాం మనసు తీర్చలేక పోతున్నానే అనే బాధ...ఇంకా ఈ నెల పాక అద్దె కట్టలేదే అన్న బెంగ.

మెత్తగా వీపుమీద లచ్చి గుండెలు....ఆ స్పర్శ గుర్తు తెస్తోంది....ఆ నాడు కూడా చెప్పలేక చెప్పలేక చెప్పింది...'పరవాణ్ణం' తినాలని ఉందని లచ్చి.

ఎంత సందుగైనా ఒక్క పూటకి మూడు రూపాయిలు ఖర్చంటే...చేయాలన్నా ఏదీ...లేదు.

ఆ బాధ అప్పలసామి శరీరాన్ని, మనసుని, నరాల్ని, యవ్వనాన్ని అలసటలా పట్టుకుంది.

*    *    *    *

పెద్దతూము దగ్గర నిలబడ్డాడు నరసింహం. ఆ కుళ్ళు కాలవ చప్పుడు వాసన తెస్తూనే ఉన్నాయి. ఆ దుర్వాసన ఊపిరితో పాటు లోపలికి పాకి మెదడంతా ఆలోచనతో కలగలిసి తిరుగుతోంది.

ఆ కుళ్ళుచేసే చెడు తెలుసు. ఆ కుళ్ళులోంచి వచ్చి పట్టుకుని పీడించే క్రిముల గురించి తెలుసు.

పారిపోవాలనుంది నరసింహానికి దాన్నించి దూరంగా. కాని అతనికాళ్ళు కదలవు. ఎవరి కోసం ఎదురు చూస్తున్నాడో వాళ్ళు వచ్చేవరకు. ఆ కాళ్ళల్లో స్వతంత్రంగా కదిలే బలాన్ని అతనిలో రాగలిగే మార్పుని గుత్తాగా కొనేశారు ఏనాడో.

కోఆపరేటివ్ సొసైటీ లో గుమాస్తా అన్న పేరుమీద అతనికి నెలసరి జీతం ఇస్తున్నా, అది అతని ఉద్యోగానికి కాదు. అతనిలో వాళ్ళు ప్రవేశ పెట్టిన బానిసత్వానికి.

దాని మూలాన్నే అక్కడనుంచి వెళ్ళిపోవాలని ఉన్నా, వెళ్ళకుండా నిలబడి ఆ వాసనని అలవాటు చేసుకోవాలని తాపత్రయ పడుతున్నాడు నరసింహం....ఆ ప్రయత్నంలోనే.

చేతిలో మధ్యకి మడిచి పెట్టిన ఆరఠావు సైజు కాయితాల్ని విప్పాడు,
కాలవ పక్కన పాకల ఓట్ల జాబితా...
అసుపుల రాములు —30 సం॥
....  ....  ....—51 ,,
....  ....  ....—28 ,,

| | | |
|---|---|---|
| .... .... .... | —56 | ,, |
| వీదిగుల వెంకన్న | —45 | ,, |
| .... .... .... | —23 | ,, |
| .... .... .... | —39 | ,, |
| మదిరి అప్పలసామి | —25 | ,, |
| మదిరి లచ్చిమి | —23 | ,, |

ఆ కాయితాల్లోంచి మురికి ఇంకా ఎలంగా లేచి తన ముఖం చుట్టూ కమ్ముకున్నట్టయింది నరసింహానికి.

చేతిలో ఉన్న కాయితాల మీద చిరాగ్గా ఉంది. ఆ మురిక్కి దగ్గరగా తన్నిడ్చి నందుకు నరసింహానికి.

'చేయాలి తప్పదు. బతకలేక చతుకుతున్న తను, వొంట్లో ఆడతనం ఎండిపోయి, నేను నీ పెళ్ళాన్నిసుమా అంటూ గుర్తుతెచ్చే పెళ్ళాం, నలుగురు పిల్లలు బతికే కొలత బతుక్కోసం చెయ్యాలి....ఆ నెలసరి జీతంకోసం...

తనింతకాలను నాశన మయ్యేవి, ఆత్మాభిమానాన్ని, ఉద్దేశాల్ని, ఆలోచనల్ని, ముందుమీద తనకున్న ఆశల్ని చంపేసే చాలా పనులు చేశాడు....చేయించారు...ఇదివరకు....బతుక్కోసం చేశాడు..

కాని ఇది....తన వరకేకాదు . ఇతర్లని మురికిలోకి లాగే ఈ పని చేయక తప్ప నందుకు మరీ అసహనంగా ఉంది.

*     *     *     *

అన్ని పాకల్లోనూ ఇంచుమించు ఒకేలా జరిగింది తంతు...

మంచేమిటో చెడేమిటో తెలియని ఆ మురికి బట్టలవాళ్ళకి, ఇదేమంచిదని, దీనివల్లే గొప్ప లాభమని నొక్కి చెప్పారు నలుగురు తెల్లబట్టల వాళ్ళు....ఈ మురికిలోకి, ఈ ఇరుకులోకి మీకోసం, మీ సుఖం కోసమే పనిగట్టుకు వచ్చామని మరీ మరీ చెప్పారు.

వాళ్ళవెనక వంగి వంగిగా నిలబడక తప్పలేదు నరసింహానికి జాబితాలో పేర్లు చెప్తుతూ.

ఎలక్షన్ పాంప్లెట్ తీసి, అందులో ఉన్న గుర్తుల్ని చూడండని....వాళ్ళు చూస్తుంటే....ఇదిగో పైనుంచి మూడోది, కిందనుంచి నాలుగోది...సరిగ్గా చూడండి ఈ గుర్తే మంచంటే, అని విశదంగా చెప్పటం నరసింహం పని.

కరెన్సీ కట్టలోంచి ఒక్కొక్క నోటే తీసి, జాబితా ప్రకారం వాళ్ళకివ్వటం ఓ తెల్ల బట్టల రాయుడు పని.

అసుపుల రాములు అందుకున్నాడు రెండు నోట్లని...

అవి తీసుకుంటున్నప్పుడు వాడి దృష్టిలో మంచి....చెడూ లేదు...వోటు, ఎలక్షనూ లేదు. తల్లికిప్పించాలి అనుకున్న సూది మందుంది...వాడి కళ్ళు మెరిశాయి అందులో కృతజ్ఞతని ఓ తెల్ల బట్టల రాయుడు రెండు వోట్ల కింద లెఖ్ఖేసు కున్నాడు,

కీడిగుల వెంకన్నా తీసుకున్నాడు నోట్లని.

'విరిగితే విరిగిందిలే రిక్షా. దేముళ్ళలా వచ్చారు, పిల్లాడి చదువుకోసం అన్నట్టు ఆ పెట్టెలో అళ్ళు చెప్పిన గుర్తుసి కాయితం వేయటమేగా...' అనిపించింది అతి మామూలు విషయంలా.

వచ్చి వాళ్ళెదురుగుండానే కొడుక్కి ఫీజు కట్టమని ఇచ్చేశాడు నోట్లని.

అప్పలసామి వాళ్ళు వచ్చి వెళ్ళిపోగానే లచ్చిని చూశాడు చిలిపిగా...వాడిలో యవ్వనం కరిగినట్టయింది లచ్చి సిగ్గుచూసి. దాన్ని దగ్గరగా పొదువుకుని పాక కప్పు కేసి తృప్తిగా చూశాడు...

వీటన్నిటినీ చూసిన నరసింహం చేతిలోనూ పెట్టారు కొన్ని నోట్లని ఆ పాక లన్నీ తిరగటం అయిన తర్వాత...

నరసింహాన్ని ఆ పెద్దతూము దగ్గర వొదిలేసి ఆ నలుగురూ వెళ్ళిపోయారు కారెక్కి.

చేతిలో ఉన్న లిస్టు చూశాడు నరసింహం...
అసుపుల రాములు...వెంకన్న...అప్పన్న...ఎల్లయ్య... మల్లన్న...
"తెలియదు...వీళ్ళెవరికీ తెలియదు" గొణుక్కున్నాడు నరసింహం.

*   *   *   *

పాకల్లో వాళ్ళకి, మేడల్లో వాళ్ళకి, అడుక్కునే వాళ్ళకి...అందరికీ ఓటెయ్యమని చెప్పిన తెల్ల రాయుళ్ళల్లో ఎవరూ చెప్పలేదు నరిసింహానికి.

మనతొత్తే వాడు మనకి వెయ్యక ఏం చేస్తాళ్ళే అనే ధీమా. మన దగ్గర బతుక్కోసం పడున్న వాడికి వోటు విషయంలో వేరే ఉద్దేశం ఏముంటుందన్న నమ్మకం.

రాములు తల్లికి చెపుతున్నాడు, ఆడాళ్ళ వేపు లైన్లో నిలబెట్టి ఏ గుర్తుకి వెయ్యాలో...

“నీ యిష్టం...నువ్వేది సెబితే...అదే” అంది ముసల్ది.
లచ్చి ముసిముసిగా నవ్వుతోంది మొగాళ్ళ లైన్లో అప్పలసామిని చూసి.
వెంకన్న రిక్షాలో హుషారుగా మోసుకొస్తున్నాడు వోటర్లని.

చుట్టూ చూశాడు నరసింహం.... పండలా ఉన్నాది ఏవ.....గొడ్డల మందలా కలగాపులగంగా....

*　　*　　*　　*

ఎదురుగా పెట్టె....చేతిలో ఓటు. పరీక్షగా చూశాడు నరసింహం... అన్ని గుర్తులే....అన్ని గుర్తులూ ఒకేలా కనిపించాయి....

‘ఈ కాయితం మీద పైనుంచి మూడోది....కిందనుంచి నాలుగోది....జాగ్రత్తగా మడిచి’ ఆ మాటలు కాలవకుళ్ళు చప్పుడుతో కలగలిసి వినపడ్డాయి నరసింహానికి.

వాళ్ళకి తెలియదు....వాళ్ళ దృష్టిలో ఇది ఉట్టికాయితం. ఓ నోటు తెచ్చి పెట్టిన కాయితం....

రాములు తల్లికి సూదిమందు....వెంకన్న కొడుక్కి బడిఫీజు....అప్పలసామికి పాక అద్దె....తాత్కాలికంగా సంపాదించి పెట్టిన కాయితం....

అంతే దాని విలువ, అంతే వాళ్ళ దృష్టికి....

అదే జీవితాన్ని నిలబెట్టే నిత్యావసరాల్ని సంఘంలో అందరికి సమంగా కూర్చే శక్తని తెలియదు—ఆ శక్తితోనే మనిషిని మనిషి దోచుకోవటం, మనిషిని మనిషి నిలబెట్టడం జరుగుతోందని తెలియదు

‘వాళ్ళకి తెలియదు...కాని తనకి తెలుసు... తెలిసి...తెలిసి...

ఓటర్ల జాబితా....తెల్ల బట్టల రాయుళ్ళు....కుళ్ళుకాలవ....మురికి గాలి పలక రించే పాకలు....అన్నీ కళ్ళముందు కదిలాయి నరసింహానికి.

చేతిలో ఉన్న కాయితాన్ని కసిగా, కోపంగా చిన్న చిన్న ముక్కల కింద చింపి, ఎదురుగా ఉన్న ఆ పెట్టి చుట్టూ చూశాడు....

ఆవేశం తీరలేదు నరసింహానికి....అతని బలహీనమైన వేళ్ళ చివర గోళ్ళ కింద ఆవేశానికి, ఆ పెట్టెని గోళ్ళతో చీల్చి దానిలో ఉన్న కుళ్ళుని, కుట్రల్ని బద్దలు కొట్టాలనిపించింది....

"తొందరగా కానివ్వండి" అని తెరవెనకనుంచి ఓ గొంతు వినపడింది నరసింహానికి.

# పిల్లి చచ్చిపోయింది

—ఎం. పినాకి

".... .... .... ...."

"సర్టెన్లీ, మిస్టర్ భార్గవా, సర్టెన్లీ. ఐ'ల్ లుక్ ఇంటుది మాటర్. సారీ సారీ ఫర్ ది డిలే....

డైరెక్టరుగారు విసుగ్గా ఫోను పెట్టేశారు. నుదురు ముడిచి, కోపంగా రిసీవర్ ఎత్తి 'గివ్ మి ఎ. ఒ.' అంటో టి. ఒ. ను కసిరారు.

"యస్. ఇట్స్‌మి. కమ్ ఓవర్ హియర్."

రెండు నిమిషాల్లో స్వింగ్‌డోర్సు తెరుచుకొని ఎ. ఒ.గారు తోసుకొచ్చారు.

డైరెక్టరుగారు సీరియస్‌గా,

"వాటీజ్‌దిస్ మిస్టర్ రాంచంద్రన్? మీ గొడవల్లో నన్ను గూడా ఇన్వాల్వ్ చేస్తున్నారు. ఆ పెన్షన్ కేసేమయింది. ఫైల్ ఇలా తీసుకురండి."

"సర్, మనం కొన్ని పర్టికులర్స్ కాల్ ఫర్ చేశామండి. అవి రాగానే..."

"నో....నోనో ఐ వాంటు సీ ది ఫైల్, గెటిట్" అని కళ్ళద్దాలు తుడుచుకోనారంభించారు డైరెక్టర్.

ఎ. ఒ. గారు తన మూడుపంటల పొన్న శరీరాన్ని మళ్ళీ మెట్లు దించి ఒగరుస్తూ సెక్షనులోకి ప్రవేశించి సూపర్నెంటు టేబుల్ మీది ఫైళ్ళ కట్టలు సగం పడేసి

"వెంకటస్వామి పెన్షన్ ఫైల్ ఎక్కడుంది? తొందరగా తీసుకురండి" అంటూ వెళ్ళిపోయాడు.

"అది అడ్మినిస్ట్రేషన్ సెక్షన్‌లో వుందండి. వాళ్ళు యాక్షన్ తీసుకున్నారు" అన్నాడు రంగనాథం వెనకే పరుగెత్తి.

"ముందు తీసుకురావయ్యా, డైరెక్టరుగారు అడుగుతున్నారు. తీసుకురా."

ఎ. ఒ. గారు మళ్ళీ తన శరీరాన్ని పైకి చేరవేసి విషయాలు విశదం చేస్తుండగా రంగనాథం ప్రవేశించి వంగి వంగి 'గుడ్‌మార్నింగ్' చెప్పి, ఎ. ఒ. గారికి ఫైలందించి దూరంగా చేతులు కట్టుకు నిలబడ్డాడు.

"సో... దిసీస్ది ఫైల్... ఊం..."

"యస్సార్, లాస్ట్ వీక్ మనం పార్టీకి నాలుగో రిమైండర్ పంపించాం." అన్నాడు ఎ. ఒ. గారు.

డైరెక్టరుగారు కళ్ళద్దాలు సవరించుకుంటూ,

"ఐతే మీరు ఎ. ఎస్. నుంచి రెండో డి. ఒ. వచ్చిందాకా మాటర్ టేకప్ చెయ్యలేదన్నమాట. దిసీస్ వెరీ బాడ్, మిస్టర్ రాంచంద్రన్.

డైరెక్టరుగారు ఎ. ఒ. గారికి ఫైలిచ్చేశారు. ఎ ఒ. గారు దాన్ని రంగనాథానికి సరఫరా చేశాడు. రంగనాథం కిందికి పరుగెత్తి దాన్ని తన టేబుల్ మీదికి గిరాటేశాడు.

ఎ. ఒ. గారు తన గదిలోకి వచ్చిందే తడవుగా బెల్ నొక్కాడు. ప్యూన్ ఎదురుగా చేతులు కట్టుకు నిలబడ్డాడు.

"రంగనాథాన్ని పిలువ్" అని ఆజ్ఞ జారీ అయింది.

రంగనాథం హాజర్.

"ఫై లేదయ్యా, చేతులూపుకుంటూ వచ్చావేం, దిన్నరుకు పిలిశాననుకున్నావా?"

రంగనాథం రాగానే, ఫైల్ అతని చేతిలోంచి లాక్కుంటూ,

"రెణ్ణెళ్ళయ్యింది. ఇంకా కేసు ఓ గాడిలో పడలేదు. డైరెక్టరేమంటున్నాడో విన్నావా, నా అడ్మినిస్ట్రేషన్ బాగో లేదట. విన్నావా, ఇన్నేళ్ళ నా సర్వీసులో నీ మూలంగా డైరెక్టరుతో అంత మాట విన్నాను మిస్టర్ రంగనాథం......"

"ప్రతి ఫోర్ట్‌నైట్‌కు మనం ఇంటరిం రిప్లయ్ పంపిస్తూనే వున్నాం సార్."

"మళ్ళీ అదే మాట. ఇంటరిం రిప్లయి పంపితే కేసు సెటిల్ అవుతుందా, ఐనా ఈ మధ్య మనకు అశ్రద్ధ కూడా పెరిగింది. పోనీ అది నా మొహానెయ్యండి. నేను పర్సనల్‌గా డీల్ చేస్తాను."

"లేదండి, క్షమించండి... ఎంత మాట, ఇంకే కేసు పెండింగు వుండకుండా చూస్తాను."

"ఎప్పుడు చూసేది? వెన్ ఆర్ యూ గోయింగ్ టు డూ దట్?"

"ఇప్పుడేనండి, ఇప్పుడే సార్. ఈక్షణం నించీ...."
కోపంతో, అవమానంతో వణికిపోతూ, సెక్షన్‌లోకి వచ్చి కూలబడ్డి,
"నాగేందర్, లెటర్ డ్రాఫ్ట్ చేశారా?" అన్నాడు రంగనాథం.

"పొద్దున్నే అది పూర్తయింది రంగనాథంగారూ" అంటూ వచ్చాడు నాగేంద్రం— పొట్టిగా, లావుగా, కొంచెం మాసిన గడ్డం, లావుపాటి కళ్ళద్దాలు, బాగానలు పెక్కిన పెదాలు, నవ్వగానే అతని నల్లటి మొహంలో మెరిసే ఓ బంగారు పన్ను.

"ఏది ఇదేనా లెటర్?"
నాగేంద్రం ఔనన్నట్లుగా పళ్ళికిలించాడు.
"నవ్వుతావేం నీ సర్వీసెంత?"
రంగనాథం తలెత్తకుండా అడిగాడు.
నాగేంద్రం తలొంచుకొని మాట్లాడకుండా నిలబడ్డాడు.
"నీ క్వాలిఫికేషనేమిటి?"

కొత్తలోనైతే జవాబిచ్చేవాడేమోకాని, పదేళ్ళ వుద్యోగం తర్వాత నాగేంద్రంలో ఆ ధైర్యం చచ్చిపోయింది.

"ఆహా ఎంత చక్కని ఇంగ్లీషు! నిన్నెవరయ్యా వుద్యోగంలో చేర్చుకున్నది? వొక్క లెటర్ డ్రాఫ్ట్ చెయ్యరాదు. ఇది నువ్వు డైరెక్టరుగారికి పుటప్ చేశావా? నీ జూనియర్స్‌కు చూపించి కరెక్ట్ చెయ్యమను."

నాగేంద్రానికి మెడ నెప్పి పుట్టింది.

"మిస్టర్, ఇట్ షోస్ యువర్ ఇనెఫిషియన్సీ. ఇట్ షోస్ యువర్ కేర్‌లెస్‌నెస్, ఇలాంటి జనంతో నేనెలా వర్కు డిస్పోస్ చెయ్యను? ఏదీ గత వారం నువ్వెంత పని చేశావో చూపించు."

గబగబా ఫైళ్ళు కదిలించబడినై.
"ఇవన్నీ" అన్నాడు నాగేంద్రం ఫైళ్ళు రంగనాథం ముందు పెడుతూ.

"ఇవన్నీ! ఎన్ని? ఆరు. వారానికి ఆరు. అందులో నాలుగు నేనే డీల్ చేశాను. పేపర్స్ ఎలా ఫైల్ చెయ్యాలో కూడా తెలియదా? ఆఫీసరుకు చూపించు సంతోషిస్తాడు. షార్ట్ లీవ్ తీసుకున్నావు. లేట్ పర్మిషన్ తీసుకున్నావు. కాని పని చెయ్యాలే అని ఎప్పుడన్నా ఓ అరగంట ముందొచ్చావా, ఓ గంట ఎక్కువ కూ

ర్చున్నావా? ఓ సండే అటెండ్ అయ్యావా? నీ అశ్రద్ధకు నేను తిట్లు తినాలి. మధ్యాహ్నం నీకో మెమో వస్తుంది. వెళ్ళు."

"ఒద్దు సార్. ఇక మీద...."
"వెళ్ళు వెళ్ళు నేనేం విన దలచుకో లేదు?"
నాగేంద్రం సీట్లో నక్కేడు.

రాత్రి తొమ్మిదింటకి ఆకలి, తిట్లు, అలసట అతన్ని విసిగించగా సైకిల్ తీసుకొని బయల్దేరాడు నాగేంద్రం. సైకిల్ లాంపులో నూనె పోయించుకుని, డబ్బుకోసం వాడితో తగవాడి, మళ్ళీ చీవాట్లు తిని నాలుగడుగులు తొక్కాడో లేదో, సైకిల్ పంచరైంది. చివరి ఓపికను కూడగట్టుకుని మూడు మైళ్ళ యింటిదాకా నడిచాడు.

సైకిల్‌కు తాళం వేసి ఇంట్లో అడుగు పెట్టగానే పెళ్ళాం ఎదురై,

"మీరొక్కరే సినిమా చూసి వస్తున్నారా? మమ్మల్ని కూడా తీసికెడతామన్నారుగా, అవును లెండి అక్కడ మేం జ్ఞాపకముంటామా? ఇంట్లో చాకిరి చెయ్యటానికిగాని...." అంటో పలకరించింది.

మాట్లాడకుండా నాగేంద్రం కాళ్ళూచేతులు కడుక్కుని వచ్చి భోజనానికి కూర్చున్నాడు.

పెళ్ళాం విసుగ్గా చప్పుడు చేస్తూ వడ్డించింది.
"ఇలా వడ్డించటానికి మాత్రం నేను కావాలి."
"నోర్మూసుకో కాసేపు." అన్నాడు నాగేంద్రం పరుషంగా.

"మూసుకునే పడుంటున్నాను లెండి. నా ఖర్మ యిలావుంది. ఒంట్లో బావున్నా లేక పోయినా...."

"అన్నం జావలా యిలా వుందేం?"
పెళ్ళాం మాట్లాడ లేదు.
"కూర ఏమీ లేదా?"
"పచ్చడి వుందిగా"
"కూర!"

"అలా గొంతు చించుకుంటారేం. కూర! మీరు తెందే ఎక్కణ్ణించొస్తుంది? అలా అలా పిల్లల్లు కొట్టి..."

"సరే, యింత చల్ల నా మొహాన పొయ్యి!"
"పిల్లి పొద్దున్నే పాలు తాగి పోయింది...."
కంచం పెళ్ళాం మొహాన కొట్టాడు. గ్లాసు పారేశాడు.

"ఏం.... అశ్రద్ధముండా. ఆఫీసులో చచ్చిచెడి నేనొస్తే, నువ్వేమో ముప్పొద్దులా దిగమెక్కి, కొవ్వెక్కి ఎదురు జవాబిస్తావా. ఒంట్లో భయముంటే అన్నం ఎలా పాడవుతుంది, పిల్లి ఎలా వస్తుంది..." అంటూ బూతులు కూస్తూ పెళ్ళాన్ని బాది విరిగిన కప్పును పారేసి అసహనంగా అవతలికి నడిచాడు నాగేంద్రం.

ఈ గొడవకు నాలుగేళ్ళ వాళ్ళ పిల్లాడు లేచి ఏడుపు మొదలెట్టాడు.
తల్లి పిల్లాన్నెత్తుకోలేదు. ఓదార్చలేదు. తనూ ఏడుస్తూ ఓ మూల కూర్చుంది.
పిల్లాడు శృతి పెంచాడు.
"కమలమ్మా, తల్లీ..." అంటూ వచ్చింది పక్కవాటా కనకమ్మగారు.
కళ్ళు తుడుచుకుంటూ ఎదురెళ్ళింది యిల్లాలు.

"కమలమ్మా, మా కోడలూ, అబ్బాయి యిప్పుడే గదిలోకెళ్ళారు. వాళ్ళకు నిద్ర పట్టదు. కొంచెం పిల్లాణ్ణి సముదాయించమ్మా... తల్లీ." అని వెళ్ళింది.

కమలమ్మ కొడుకువైపు నడిచి 'ఊరుకోరా' అంది.
తల్లి కనిపించగానే పిల్లవాడు గొంతు పెద్దది చేశాడు.

'వెధవ ముండాకొడకా, నా గండాన పుట్టావురా, తండ్రీ. కొడుకూ నా బతుక్కి యములాళ్ళలా దాపరించారు. ఊరుకో. నాలుగేళ్ళొచ్చినా ఇంకా రొమ్ము కావాలా. ఏముంది, నా నెత్తూరు తాగుతావా? నే చస్తే పీడాపోతుంది. చావు. అందరూ నా మీదే పడి యేడవండి. ఛుయ్. నోర్మూస్తావా లేదా?.......'

కొత్తగా వేయించుకున్న రెండు చేతుల గాజులూ పగిలి పోవటంతో తల్లి మళ్లీ గొల్లుమంది, తల గోడకేసి బాదుకుంది.

* * *

కిటికీలో పిల్లి మ్యాఁవుమంది.
అలసి మగతగా కళ్లుమూసిన పిల్లాడు మేల్కొన్నాడు.
పిల్లి మళ్లీ మ్యాఁవుమంది.
చేతికందిన విరిగిన కప్పును తీసుకుని కసితీరా పిల్లివైపు గిరాటేశాడు పిల్లాడు.

# 'నక్సలైట్'

— పింగళి రంగారావు

చీకటి పడబోతోంది—

ఎంత సేపటినుంచి ఎదురు చూసినా బస్సు వచ్చే జాడల్లేవు. ఈ బస్సు తప్పితే, సిటీకి పోయేందుకు మరో బస్సు లేదు. గుంపులు గుంపులుగా రోడ్డుపక్క జనం. వైధవ స్టేజి కూర్చునేందుకు షెడ్ అయినా లేదు. అలవాటుగా బస్సు ఆగుతుందిక్కడ. మందంతా యిక్కడే నిల్చుంటారు. ఇది స్టేజి— వేరే ఆధారం లేదు... దూరంగా పొలాల్లో పనిచేసే కూలీలు మోపులెత్తుకొని వూగుతూ నడుస్తున్నారు. పక్క వూళ్ళో అంగడివల్ల మంది మరీ ఎక్కువగా వున్నారు. బస్సు వస్తే యింత మంది ఎలా ఎక్కాలో! బస్సులో యింత మందే ఎక్కాలనే రూలేం లేదు. ఎంతమందైనా ఎక్కేయగలరు— అసహనం పచార్లు చేయిస్తోంది. రకరకాల చర్చలు, చర్చలు విన్నకొద్దీ కొంత మందికి భయం! కొంతమంది ఉత్సాహంగా సిగరెట్లు గుంజుతున్నారు. తలపాగాల మనుషులు, వైట్ పాంట్ల మనుషులు, ధోతులు, పైజామాలు అన్ని రకాలవాళ్ళు ఈ స్టేజి మీద....దూరంగా వినవస్తున్న కూలీల పాటలు. రోడ్డును క్రాస్ చేస్తూ పొలంలోకి దిగుతున్న ఎద్దులు, బర్రెలు. కవ్వం చిలుకుతున్నట్లుగా నీళ్ళ చప్పుడు. చీకటి పడబోతోంది. వేపచెట్టుమీద రెక్కలు సవరించుకుంటున్న పక్షుల చప్పుడు—నిశ్శబ్దంగా పడుకున్న నల్ల తాచులా మెలితిరిగి తలాతోకా తెలియని రోడ్డు. ఇంకా బస్సు వచ్చే సూచనల్లేవు........

ఏదో శబ్దం.
బస్సు....బస్సొస్తోంది—
అందరి కళ్ళు రోడ్డునే చూస్తున్నాయి.
వేగంగా దూసుకొస్తోంది.

పెద్దగా అరుపులు. ఆపండి....ఆపండి....అని పొలాల్లోంచి గొంతులు మొత్తుకుంటున్నాయి.

"ఏదో ప్రమాదం—"
"ఎవరో చచ్చిపోయారు."
"ఆపాం."

"రోడ్డుకు అడ్డంగా నిలవండి."
"రాళ్ళందుకోండి."
"లైన్....లైన్‌గా నిలవండి."
రంయ్‌మన్న మోతతో కారు వస్తోంది.
"ఆపండి!" వెస్గా సీడల్లా పరుగెత్తుకొస్తున్న మనుషులు.
ఒకళ్ళ చేతులు వొకళ్ళం పట్టుకొని బ్యారికేట్లలా నిల్చున్నాం.

కీచుమంటూ రోడ్డు మొత్తుకొంది. అందరం పరిగెత్తాం. కారాగింది. పదండీ అంటూ ముందుకురికాం. ఆపి వస్తే ఆపి, కారును పక్కకు కోసాడు. రోడ్డు కింద బురదలో టైర్లు గీ అంటూ తిరిగాయి.

స్టీరింగ్ ముందునుంచి అతను దిగాడు. ఎత్తుగా బలిసి వున్నాడు. గొంగళి పురుగుల్లా గుబురుగా మీసాలు. ఎర్రగా వున్నాడు. కళ్ళు కూడా ఎర్రగానే-స్టీరింగ్ పక్కనే ఆడమనిషి. అతని లాగే ఉంది. భీతహరిణలా చూపులు. మెళ్ళో రవ్వల నెక్లెస్. చెవులకు భయంతో వూగుతున్న రింగులు. డోరును కోపంతో విసిరాడు. నీటి మీది బోటులా వూగింది కారు.

"వాట్ హాపెన్. ఎందుకాపారు కారు. దౌర్జన్యం చేస్తారా!"
తీక్షణంగా అన్నాడు.
ఆమె అతన్ని, అందర్నీ మార్చి మార్చి చూస్తోంది.

"ఆపండి అని అరుపులు వినపస్తే ఆపాం. కాని దౌర్జన్యం చేయ కాదండీ" అన్నాను.

"మేం అప్పుతున్నా మీరెందుకలా నడిపారు."
"మనల చంపాలని."
దూరం నుంచి యిద్దరు వ్యక్తులు పరుగెత్తు కొస్తున్నారు.

"ఊ....ఊ....పక్కకు తప్పుకోండి. ఏమీ జరుగలేదు." అంటూ స్టీరింగ్ ముందుకు నడిచాడు.

"వాళ్ళ రానీయండి."
"నా కారును నాశనం చేశారు."
"మీ కారేం కాలేదండీ. బురదలో దిగబడింది. తప్పు మీది కాని మాది

కాదు. అయినా మీకు శ్రమ కలిగించం. యింత మందిమి వున్నాం. ఎత్తి రోడ్డు మీద పెట్టగలం." అన్నాను.

వాగరుస్తూ వాళ్ళు దగ్గర పడ్డారు.
"ఏంట్రా ఏం జరిగింది."
"ఆవుని చంపొచ్చాడు." అంటూ శ్వాస ఎగబోస్తున్నారు.
"ఆవు చస్తే చచ్చింది. దాని కోసం కారు ఆపాలా."
"డబ్బు కట్టి మరీ కదలాలి."
"మనిషి చచ్చినా అంతే అన్నమాట."
"వాళ్ళకు మనిషి చస్తేనేం, ఆవు చస్తేనేం."

తలో రకంగా విరుచుక పడుతున్నారు. గుంపు వెనకగా వున్నవాళ్ళు యిష్టం వచ్చిన బూతులు పలుకుతున్నారు. తన్నండి, దాన్ని కిందకు గుంజండి అంటున్నారు. అతను సిగరెట్టును పెదవుల కొసన ముట్టిస్తూ వాళ్ళతో మాట్లాడుతున్నాడు. అందరి గొంతుల్లోనూ ఆవేశం. వెనక నుంచి మందిని తోస్తున్నారు. కారు అద్దాలమీద చేతులానించి కారు మీద పడకుండా నిలగొక్కు కుంటున్నారు ముందున్నవాళ్ళు. కారు డిక్కీ మీద మద్దెల మోగుతుంది. కొందరు పక్కకు చేరి గుసగుసలు....

ఆమె ఏడుస్తోంది.
"లంజె సూడు ఎట్లా ఏడుత్తోందో."
"నీ అమ్మ....ఆవుని చంపిపోతారు."
"దబాయిస్తాండు సూడు లంజకొడుకు."
"వీని పెళ్ళాం........"

'ఏయ్! అనవసరంగా ఎందుకు తిడుతారు. మీకేం సంబంధం. కారు దగ్గర నుండి జరగండి మొదలు. ఊ జరగవయ్యా.'

'గీ-దయే పనికిరాదు.'
'పనికిరాక ఏం చేద్దామో చెప్పండి,' అన్నాను అసహనంగా.
'తందాం.' గుంపులోంచి.

'ఈ పరిస్థితే మనకేర్పడితే. మీరు ఏడవకండమ్మా! ఏదో ఆవేశంగా అంటున్నారు వాళ్ళు. ఆవు చనిపోయినందుకు వాళ్ళకు డబ్బిస్తే సరి.'
అతనికీ, ఆవు వాళ్ళకూ బాజీ కుదరటం లేదు.

'యివాళో రేపో చనిపోయే ఆవుకు రెండువందలా! నాన్‌సెన్స్.' అంటున్నాడతను.

'అందుకే యిప్పుడు చంపిండా!'

'రెండువందలంటే ఎట్లానయ్యా. మీరిలా పక్కకు రండి సార్.' అంటూ అతన్ని ఆవువాళ్ళను పక్కకు తీసుకపోయాడు మధ్యవర్తి.

'వీడెవడో మధ్యన.'
హ్యాండ్ బాగ్‌లోని కర్చీఫ్‌తో ఆమె ముఖం తుడుచుకుంది.
మిష్టర్! మీరిలా రండి.' అంది.
కారుకు దగ్గరగా జరిగాను.

'చూడండి. మేం చాలా పని మీద వెళ్తున్నాం. అనవసరంగా మీరంతాకల్సి కారును ఆపారు.'

'వాళ్ళ అరుపులు విని ఆపామండి!'
'మమ్ముల చిక్కుల్లో పెట్టారు.'
యిందులో చిక్కేముందండీ.'

'మీరు మనసులో ఏదో వుద్దేశం పెట్టుకొనే కారు నాపారు. అవు చనిపోతున్నా మీరు ఆపే వాళ్ళే. యింత మంది యిక్కడ ఎందుకున్నట్లు. మీ చేతుల్లో కట్టెలూ, రాళ్ళూ ఎందుకున్నాయి....మీరంతా నక్సలైట్లా వున్నారు:'

ఆమె మాటతో అదిరి పోయాను.

'మీరు తొందరపడుతున్నారు. మేమంతా బస్సుకోసం నిల్చున్న వాళ్ళం. కాని నక్సలైట్లం కాదు. మీకాభయమొద్దు. నేను ప్రభుత్వోద్యోగినని హామీ యిస్తున్నాను.'

"ప్రభుత్వోద్యోగి నక్సలైట్ కాకూడదా! అయినా మీరెందులో పనిచేస్తారు."
"ఆ వివరాలన్నీ మీకెందుకు లెండి." అయిష్టంగా అన్నాను.
"చెప్పటానికేం......"
"స్కూల్ అసిస్టెంట్‌ను."
"ఓహో! ఈ తెలంగాణా వుద్యమం వెనుక వుంది మీరే అన్నమాట."

"అంత క్రెడిట్ మాకివ్వకండి."

"సారీ! యిలా అడిగినందుకు మరేం అనుకోవద్దు."

నేను ఆమెతో మాట్లాడటం చాలా మందికి యిష్టమనిపించలేదు.

ఆమె భయాన్ని చూస్తే జాలేసింది. నా పక్కనే వున్న తను పక్కకు జరిగి యిద్దర్ని పిల్చుకొని ఏదో చెప్తున్నాడు.

"తొందరగా రావాలి." అంటూ పురమాయిస్తున్నాడు.

వాళ్ళు తొందరగా అడుగులు వేస్తూ వూరివేపు నడుస్తున్నారు.

అతనేం చెప్పాడు వాళ్ళకు!

వాళ్ళెందుకు అంత తొందరగా పరుగెత్తుతున్నారు.

ఆ చెప్పినతను అపు వాళ్ళ వేపే మాట్లాడుతున్నాడు రాజీ చెడగొట్టే ప్రయత్నంలో—

నాలో ఏదో అనుమానం. ఎన్నో ప్రశ్నలు.

అతన్ని చూస్తే జాలి కంటే ఆమెను చూస్తేనే జాలి. గొప్పింటి బిడ్డ.

ఎన్నడైనా ఆమె ఏడ్చి వుంటుందా! యింత మంది మధ్య నేరస్తురాలిలా బోనులో నిల్చున్నట్లు....ఎందుకీ దౌర్భాగ్యం. ఎన్నో ప్రశ్నలు సూటిగా, వికృతంగా ఆమె ముఖంమీద విరుచుకపడుతున్నాయి: అపు చచ్చిపోయింది. అది యాక్సిడెంటల్. ఉద్దేశపూర్వకంగా చంపి వుంటారా! ఇంతమంది వుండీ వొంటరి వాళ్ళు. యింత మంది ఎవరికీ ఏదీ కారు. కాని అంతా వొక్కటయ్యారు. న్యాయంవైపు మొగ్గారనా! ఏది న్యాయమని—అతను వున్నవాడు కావడమే నేరం, అన్యాయం. వీళ్ళ కసికి కారణ మదే.

చూపులతో కాలుస్తోన్నారు, మాటలతో శూలాల్లా గుచ్చుతున్నారు.

ఎంత వుంటేనేం, ఈ పరిస్థితుల్లో ఏమీ లేనివాళ్ళు.

ఎంత పరువు వుంటేనేం, యింతమంది ప్రజల తీర్పును ఒప్పుకొనిచావాలి.

అందరి మనసుల్లోనూ అల్లరి పెట్టాలనే.

అతను వూళ్ళోకి మనుషుల నెందుకు పంపాడు?

రాజీ పరుచకుండా విషయాన్ని ఎందుకు సాగదీస్తున్నట్లు!

ఈ అదను వుపయోగించుకుంటారేమో. దొంగలు....దొంగలు....యింతలో బస్సు వచ్చింది.

వెళ్ళాలి.... వెళ్ళాలి.... వెళ్ళిపోతే యిక్కడేం అన్యాయం జరుగుతుందో. వాళ్ళనూ, వాళ్ళకారును ఏంచేస్తారో.

బస్సుకదలబోతోంది.

ఆమెనుచూసాను, ఆచూపుల్లోభయందాక్కోలేకపోతోంది.

ఎఱ్ఱటి పెదవులు కదులుతున్నాయి, జాలిగా ఆమె కళ్ళు.

చాలమంది బస్సువేపు పరిగెత్తారు; తిట్టుకుంటూ, అరుస్తూ.

బస్సు కదిలి పోయింది.

"మీరు వెళ్ళిపోలేదేం."

"యిదేదో తేలిపోతే మిమ్మల పంపేయొచ్చు."

'చాలా థాంక్స్!'

"మనిషి మనిషికి ఈ మాత్రం సాయపడకుంటే ఎట్లా."

"మా వారిది కాస్త దుడుకు స్వభావం. అదేదో మీరే తేల్చండి."

యిప్పుడామె గొంతులో వొణుకు లేదు.

"వంద రూపాయలేదొ అడుగుతున్నారు. యిచ్చేస్తే సరి."

"అంత మొత్తం యిప్పుడు మావద్ద లేదు. పోనీ ఓ సాయం చేయగలరా."

"చెప్పండి."

సాయం చేయాలన్నదే నా తొందర.

"ఈ బంగారుగాజు తీసుకోండి. వందరూపాయలకు మీరు భరోసా యివ్వండి. డబ్బు పంపి గాజు తెప్పించుకుంటాను. మరోలా అనుకోరుగా."

"నా మీద మాత్రం మీకేం నమ్మకం."

"నమ్మకమే. మీ అడ్రసు యివ్వండి."

"నాస్టీ ఫెల్లోస్." అంటూ అతను విసుక్కుంటూ వచ్చాడు.

ఆమె ప్రశ్నార్థకంగా అతని వేపు చూసింది.

"వంద రూపాయలకు నా వాచ్ వాళ్ళ ముఖాన పారేసాను."

"ఎవరికిచ్చారు" అంది.

"ఆ పెద్దమనిషి రాపుగోపాల్‌కు."

"వీరు మనకు హెల్ప్ చేస్తారు."

"వై షుడ్ హి హెల్ప్ అజ్."

"నమ్మదగిన వాడే, ఆ వాచ్ వీరికే యివ్వండి."

"అవునండి. వీరికిచ్చినా ఫర్వాలేదు. మా స్కూల్ టీచరే."
"ఊఁ మీరే తీసుకోండి. డబ్బు పారేసి వాచ్ తెప్పించుకుంటాను. అడ్రస్"
తెగతిట్టుకుంటూ, సిగరెట్టు కొరుకుతూ కారు స్టార్ట్ చేశాడతను.
"పంద రూపాయలకే వదిలిపెట్టారా! ఛీ."
అంటూ పళ్లు బిగించాడు యింతకుముందే కొందరిని వూళ్ళోకి పంపినతను.
కారు ఎర్రలైట్లు దూరమయ్యాయి.
ఏ అన్యాయం. దౌర్జన్యం జరుగకుండానే కారు కదిలిపోయింది.

ఇంత మందినుంచి ఆమెకు ధైర్యం యివ్వగలిగానని, యింతమంది పురుషులు ఆమెను హేళన చేస్తూవుంటే వాళ్ళనెదిరించి వోదార్చగలిగానని, వేలయై వాణకిపోతూవుంటే ఆత్మీయునిలా, మనిషిలా ఆదుకోగలిగానన్న తృప్తి—సిటీకి నడిచి వెళ్తున్నానన్న అలసటను కూడా కల్గించలేక పోయింది,

*    *    *    *

నా జీవితంలో యింతకంటె గొప్ప అడ్వెంచర్ ఏముంటుందని. ఏ ఒక్కరికీ వున్న వానిమీద సానుభూతి లేకుండా పోయింది. ఆనాడు ఆ గుంపులో అందరి కళ్ళల్లోనూ కసి. ఆఫీసరు, లక్షల ఆస్తి. అయితేనేం చేతిలో డబ్బులేని వాడయ్యాడు. అంతస్తుని చూడగానే ఈ మనుషుల కళ్ళల్లో నిప్పులు చెరుగుతుంటున్నారు. ఒక్కణికీ దయలేదు ధర్మం సంగతే లేదు. నేను లేకుంటే ఏంచేద్దురో—అతను వూళ్ళోకి మనుషుల నెందుకు పంపినట్టు. అయన తిట్టుకున్నాడంటే తిట్టుకోడూ, పరువుపోయాక. ఇంతమంది కలిసి ఒక్కణ్ని చేసి పరువుతీసి, అవను చిక్కగానే దోచుకోవాలనే యీ మనస్తత్వం యిక పెరగొద్దు.

స్కూల్లో సరిగ్గా పాఠాలు చెప్పడానిక్కూడా మనసొప్పటంలేదు.
నేను కూడా సరిగ్గా వాళ్ళకు న్యాయం చేకూర్చలేక పోయాను—
వెధవ పందరూపాయలకు వాచ్‌ను అట్టిపెట్టు కున్నాను,
ఆ క్షణాన చేతిలో డబ్బులేక పోయింది....వెధవ బతుకు.

వీధిలో ఏ కారు చప్పుడైనా, ఏ జీపు చప్పుడైనా వాళ్ళు వస్తున్నారేమో అనే, రోజులు గడచినా ఎవరూ రావటం లేదేం.

వాళ్ళకీ వస్తువ జ్ఞాపకం వుందోలేదో—
నేనే తీసుకవెళ్ళి యిస్తే బాగుండేదేమో....
వాకిట్లో జీపు ఆగిన చప్పుడు.

పరుగెత్తుకొంటూ వెళ్ళి తలుపు తెరిచాను. ఆ తొందరలో పడబోయాను.

ఎదురుగా యిన్స్‌పెక్టర్.

"రాజారావుగారు మీరేనా?"

"అవును ఎందుకూ?"

'మీ మీద వారెంటుంది.'

'వారెంటా? నా మీదా!'

దౌర్జన్యంచేసి కొంతమందితో కల్సి మీరు ఫారెస్ట్ ఆఫీసరును అల్లరి పెట్టారని....మీకు నక్సలైట్ల యాక్టివిటీస్‌తో సంబధం........

యిన్స్‌పెక్టర్ మాట పూర్తి కాకుండానే అదిరిపోయాను. కాళ్ళకింద భూమి కదులుతూ వుంటే....

జీవంలేని మట్టిబొమ్మలా యిన్స్‌పెక్టర్‌తో జీపెక్కాను.

పిడుగులు పడుతున్నట్లుగా జీపు శబ్దం.

రోలరులా, బరువుగా కదలివెళ్తున్న జీపుటైర్లు నావాకిట్లో బురదను చల్లుతూ ముందుకు నడుస్తుంటే—

జీపులో శవంలా నేను.

---

# 'టాయ్-లెట్'

—ముక్కామల వెంకటేశ్వరరావు

ఔట్ హౌస్‌లోని అద్దంలో—
అప్పుడే చీర మార్చుకోబోతూ తొంగిచూసింది గౌరి.
ముద్దమందారలాంటి శరీరాన్ని చూస్తూంటే తనకే సిగ్గువేస్తోంది,
మొగ్గయి పోతోంది.
గులాబి గుత్తులున్న ఎర్రసిల్కుచీర ఎత్తుగావున్న వక్షానికి
హత్తుకుంటూ పదేపదే అద్దంలో చూస్తూంటే—
ఆదేదో మధురంగా మత్తు ఆవరించింది.
కళ్లు మెత్తగా మూసుకున్నాయి.
ఒళ్లు జల్లుమంటోంది.
రకరకాల వూహలు రక్తంలోకలిసి ప్రవహిస్తున్నాయి.
మనసు జ్ఞాపకాలను తిప్పుకుంటోంది.
దోరవయసు సిరల్లాంటి ఘడియల్ని కోరికోరి చూపుతోంది.
మూసుకున్న కన్నుల్లో చూపు మసగ్గా విసుగ్గా వుంది.
విరిసిన పువ్వుల్లా తెరచుకొన్న చెవుల్లో సంగీతం గింగురులు పెడుతోంది.

కానరానిహస్తమేదో కనికరంతో తనముంగురులు నిమురుతూ 'నిన్నీ వేషంలో చూడలేను గౌరీ! ఈ చీర కట్టుకో' అంటూ మందారంవంటి తనశరీరానికి అందాన్నిచ్చే ఎర్ర సిల్కుచీర తన చేతిలో పెట్టింది.

తానాచీర కట్టుకొంది.
తన మల్లెపూవంటి చీరె విడిచిపెట్టింది.

పువ్వులాంటి తనవళ్లూ ఒంటిమీద ఎర్ర సిల్కుచీరమీదున్న గులాబిపువ్వులు ఆయన హత్తుకోవడంలో—ఆ మత్తులో నవ్వి నలిగి పోయాయి.

తనువు పరవశమయింది.
తను వశమయింది.
తనవశమయింది.

ఆ క్షణం మాత్రానికే ఆమె తన శాశ్వతమయింది.
ఆయన మసిలాంటి కళ్ళు ఇంకా కసిగా తనవైపే చూస్తున్నాయి.
తను నునుసిగ్గుతో నుసయిపోతోంది.
ఆయన ఇంకా రసపట్టులోనే—
తను కట్టుకున్న చీర తనకు తెలియకుండానే చేతిలో పట్టుకొని—
"ఏదీ ఒక్కసారి చూసుకో అందం!" అంటూ అద్దం జూపాడు.
అద్దంలో అందం ముద్దగా……
ముడుచుకుని ముద్దయిపోయింది.
శీలం జాలికి హత్తుకుపోగా—
జాలి శీలాన్ని ఎత్తుకుపోయి మంచంమీద కూలవేసింది.
ఆ కుదుపులో కల కరిగి……
సున్నని కన్రెప్పలు విప్పుకున్నాయి.
విప్పుకున్న కన్నుల్లో పచ్చినిజం మిలమిల్లాడుతోంది.
కలకాలం మనగలిగే కలను కరుణించాడు ధర్మారావు.
నిజమే నంటోంది ప్రత్యక్షంగానున్న అద్దం.
సాక్ష్యంగా చేతిలోని చీర……
శీలంగా జారిపోయింది.

తను వూహించని కలలు నిజమయి రుజువయ్యాయని తను నమ్మలేదు. ఆ యెర్ర సిల్కుచీర, ఆ నిలువుటద్దం జతగా గతంలాంటి నిజాన్ని కలగా మార్చి చూపెడితేనేగాని తను నమ్మలేదు.

అందుకే ఆ నిలువుటద్దం తనకెంత ముద్దు.
ఆ ఎర్ర సిల్కుచీరంటే తనకెంత మోజు.
ఎర్ర.
ఎర్ర చీర,
దోర వయసు.
తనకు చీర ఖరీదే తెలీదు.
శీలంధరేం తెలుస్తుంది గనుక,
తనకు తెలిసిందల్లా ధర్మారావు మారాజనే.
ఛీ! పాడు ఆలోచనలు.
ఆ మారాజు గురించి చెడు ఆలోచిస్తే తనకెంతో దోశం.

మా రాజుదెంత జాలిగుండె!

వాడు సచ్చిపోయిన్రోజు తగలెయ్యటానికే డబ్బులేక దిగులు పడి కూర్చుంటే 'గౌరీ! పనికానియ్యండని అడక్కుండానే వంద రూపాయలు చేతిలో పెట్టాడు. అయ్యన్న గాబట్టి ఆదుకున్నాడు. మరొహడైతే పలకరించపోనూ. తద్దాచుకోమని 'ఓటిఅప్పు' ఇచ్చాడు. కూటికీ గుడ్డకు ఇబ్బంది పడమాకని నిబ్బరం చెప్పాడు. లేకపోతే తనేమయ్యేది. ఏ అయ్యానడిగేది? అలాంటి మారాజుని పట్టుకొని ఏవేఁవేఁవో పిచ్చి అలోచన్లు. మనసు మందలించింది.

నిజానికి తనకీ రోతనిపించింది.

అప్పుడే నీళ్ళోసుకొచ్చి అరగంటయిందో లేదో పిచ్చి పిచ్చి ఆలోచనలతో ఒళ్లు వేడెక్కి ముచ్చెమటలు పోసి మరీరోతగా........

ఎదురుగుండా లావెండరు డబ్బామీద మొండి ముక్తో పిండిమరలాంటిపిల్ల పగలబడి నవ్వుతోంటే___

చేత్తో అందుకొని మూతీసి ముక్కుకద్దుకొంది.
ఐహిక సుఖంవంటి మైకం మరో లోకానికి లాక్కుపోయింది.
తనకది పాతలోకమే.
'ఎక్కడ చచ్చార్రా?'

ధర్మారావుగారి ఆ ఒక్క కేకతో బండెడు అంట్లు ముందేసుకు తోంతోన్న గౌరి టక్కున ఆగిపోయింది. శ్వాస మాత్రమే ఆగిపోలేదు. కడుక్కున్న చేతుల్తో ఉడుకుడుక్కూ అద్దొస్తున్న చీరకుచ్చెళ్లు ఎగపట్టుకొని ఛెంగుఛెంగున మెట్లెక్కుతోంటే కాళ్ళకున్న మెట్టెలు ఖంగు ఖంగుమని సంగీతం మట్లుగా మారాయి.

మీదన మేడగదిలో పట్టెమంచమ్మీద కూర్చున్న పెట్టంత ఆసామిని చూసే సరికే తనకు ఒళ్లు చెవట్లు పోసాయి.

గుండె దడ దడలాడుతోంది.
కాళ్లు గజగజ ఒణికిపోతున్నాయి.
'రైలు వేళయిందే. ఆ బూట్లిలా పట్రా.'
అమ్మయ్య! గుండె బరువు దింపినట్టయింది!
గాజొప్పిళ్లు కాసింత దానికే కంగారు పడిపోతారేమా అనిపించింది.

ఆయన గావుకేకవిని ఆస్పత్రిలోని తన రంగన్నమాఁవకేకీడు మూడిందో నని హడిలి సచ్చింది.

తనెంతో మోజుపడి చేసుకున్న రంగన్నమాఁవ పది కాలాలపాటు పూల రంగళ్లా తిరక్కుండానే మూలబడిపోయాడు.

రెణ్ణాళ్లా? మూన్నాళ్లా?

శాన్నాళ్లయింది ఆస్పత్రికెళ్లి. అసలు ఆ నర్సులు వదలబుద్ధిగాక వుంచేసుకున్నారేమో! ఛ! తన మాఁవ అలాంటోడు కాడు. తనలాగానే, ఎంత సక్కనాల సుక్కయినా కన్నెత్తి సూడ్డు. మరా దాకచేల్లెంజేత్తావుంటారో బోధపడ్డు. యాకచేరుల్లాగా యాసాలూ ఆళ్లూ! తనమాఁవ యిలాగే జేశేవాడా? ఎంత మొరాయించిన కార్నైయినా క్షణంలో మరామ్మతుచేసి తుర్రున తోలుకు పోయేవాడు.

అలాంటోడు ఆస్పత్రిలో బబ్బునిపోయాడు మాయదారి జబ్బుతో. ఆడు మందులు కొనుక్కుంటావుంటాడు. అన్నకోసం కొరుక్కుంటావుంది. అయినా తన మనసుకేదో ఆదో రకం నమ్మకం—తన మడిసి తిరిగొస్తాడనీ— ఎప్పుడోతుర్రుమనొచ్చి హార్మనే మోగిత్తాడనే! దరమారావుగారి కారు ఆదే గడపాల.

'ఏమేఁ! ఇంకా కాలా బూట్లు తుడవడం?
అంట్లు తోమినట్టే!
ఎడాపెడా బ్రెష్ చేస్తోంది.
ఎగాదిగా శ్వాస తోస్తోంది.
ఒళ్లంతా చెమట కారుతోంది. ముంజుకంపు.

పై నుండి నల్లనికాయం పులుంకుంటోన్న లావెండర్ తనమీద రాలుతోంది మత్తు కంపు.

రెండూకల్సిన గమ్మత్తుకంపు.

ఆ కంపులోనుండి, రొంపిలోనుండి బయటపడేసరికి పూరికెళ్లే తొందర్లో అయన బయటబడబోతున్నారు. తనే బయటపడి అడిగింది - ఈ నెలజీతం ముందుగా యిమ్మంది. మాటిడికి మందులు కొనాలంది.

ఇరవై రూపాయలు చేతిలో పెట్టాడు - ధర్మారావు కాదు - దరమరాజు.

రోగిష్టి మొగుణ్ణి దక్కించుకోవాలని తనీపనిలో చిక్కింది. నెలోర్జులూ, రెండు చేతులూ అరగ్గీసుకున్న శ్రమఫలంకాదు - మారాజు దానం!

నిండుగా చేత్తో పట్టుకొని రెండోచేత్తో ముఖంమీద చెమట పిండుకొంది.
ఒక చేతిలో రూపాయలు.
మరో చేతిలో చెమట.
రెండూ సమానమే. సరికిసరి. అని తనకనిపించదు.
రూపాయిచ్చియ్య ఎంతయినా బరువే.
చెమట తగ్గనిన చేతితడి వడిగా ఆరిపోతుంది. అందుకే తనకది తేలిక.

చెమటక్కరీదనీ— దాని విలువ శానా ఎక్కువనే సంగం ఎంకటేసు పనోళ్ళతో అంటుంటాడు. దర్మ ప్రెబువులాంటి దరమారావుగారిమీద కారాలు మిరియాలు నూర్తాడు. ఆయన్ని జాలిగుండెరా ఎంకటేసూ అంటే 'జాలీగుండె' అంటాడు. యదవ యూసా బాసాను. ఆయన మంచితనం ఈ యదవలకేం తెలుసుగనక!

పీడ కల.
ఛీ! ఒళ్లు సుబ్రంగా వుంచేగాని మనసుకు మంచికలలు రావేమో!
ఒళ్ళంతా లావెండర్ చిమ్ముకుంది.
కళ్ళంతా కమ్మదనం కమ్ముకొంది.
ఎదురుగా మురుదు రంగు తిలకం పలకరిస్తోంది.
అంది పుచ్చుకొన్న 'బిందీ' మూతరాదే!
అబ్బ ఎంత బెట్టుసరో!
తన్నింతవరకూ కన్నెత్తిచూడలేదని అలక కాబోలు!
గట్టిగా మూత తిప్పింది.
మూత విప్పింది.
ఓ యబ్బో! నేనూ ఒకనాడు నీకంటె బెట్టుగలదాన్నే! అనుకొంది.
ముఖాన నక్కని నుక్కెట్టుకుంది.
మిలమిలా మెరసిపోతోంది బొట్టు.
ఎర్రని కుర్రబొట్టు.
రక్తం బొట్టులాంటి బొట్టు.

తనబొట్టు జూశేనేమో రక్తంలాంటి ఎర్రని యాపిల్ పళ్లన్నీ పగలబడి కొవ్వెక్కి నవ్వుతున్నాయి.

ఎఱ్ఱని పండందుకొని కసికొద్దీ కసుక్షున కొరికింది.
తన్ని ధర్మారావిలానే కొరుకుతాడు.
రక్తంవంటి ఎఱ్ఱని యాపిల్‌పండు తింటోంది.
రక్తం పండు తింటోంది.
తను పండు తింటోంది.
తన పండే తింటోంది.

తనే అన్నాడు. తనీపళ్లు తింటే తనవళ్ళుకూడ పండిన పండులా పసిమి తేలుతుందని. రక్తం పట్టుతుందని.

ఆయనకు మొదటినించీ తనరక్తమంటే ఒల్లమాలిన అభిమానం—శ్రద్ధాను.

ఆ నాటికి ఆనాడు మాత్రం తనమావ చావుబతుకుల్లో అస్పత్రిలో కొట్టు మిట్టాడుతుంటే—

డాక్టర్లు రక్తం కావాలన్నారు.
తన రక్తం తీసికోమంది.
పనికిరాదన్నారు.
ఈ డాక్టర్లకేం జబ్బో!
అందర్లోనూ రక్తం ఒకటేగా!
మరి మొగుడికి పనికిరాని తన రక్తం ఈధర్మారావుగారికెలా పనికొచ్చిందో!

ధర్మాత్ముడు కాబట్టి అంత రాత్రపుడు వెళ్ళినా లేదనలేదు.. రంగన్న మావకు రక్తం కొంటానికి యాభైరూపాయలడిగింది. మర్నాడు తనరక్తమమ్మి తీరు స్తానంది.

ఆ మాటకు ఆయన ససేమిరా ఒప్పుకోలేదు. రక్తం కొనే ఆస్పత్రిలో అళ్లు చాలా తక్కువ డబ్బు యిస్తారంట.

అకాటికి ఆ రక్తం నాకే ఇవ్వరాదా? అన్నాడు. పిచ్చిమారాజు! పరాచికానికే అన్నాడో! మరెంటో! తన రక్తం ఆయనేంజేసుకుంటాడో? ఇప్పటికీ తనకు సరిగ్గా అర్థమయిచావదు. ఇదేకాదు. ధర్మారావుగారు పెద్దపెద్ద కామందులిళ్లల్లో విందు కెళ్లొచ్చినప్పుడల్లా ఏమోటో? అదోలా అయిపోతారు. కళ్ళతో కొరకొర లాడుతూనే పళ్ళతో సన్నగా చిరునవ్వు నవ్వుతూ వుండేవారు. అదెందుకో? అదీ తనకు తెలీదు.

ఆరోజూ అలాగే వున్నారు. డబ్బడిగితే డ్రాయర్లో వుంది పట్టుకు పొమ్మన్నారు, పక్కమీద పక్కకు దొర్లుతూనే.

ఆత్రంకొద్దీ తను డ్రాయరు తీసింది.
చిత్రం!
నాగుబాము కాటేసినట్లయింది.
తేరుకొని తేరిపారజూస్తే ఎన్నో చిత్రాలు.
అన్నీ దిసమొలలే! ఛీఛీ!
మైకంలో అన్నాడనుకుని 'డ్రాయర్లో డబ్బు లేదు బాబూ!' అంది.
'మరేముంది? నీముఖం ఇలా పట్రా' అన్నాడు.
బితుగ్గా, బెరుగ్గా ఆయన చేతికిచ్చింది.

ఓ దిసమొల బొమ్మని పైకెత్తి "ఇదేవిఁటీ? ఇది డబ్బుకాదూ?" అంటూ విరగబడి నవ్వేశాడు,

పిచ్చిమారాజుకు మైకం తగ్గినట్టు లేదు.
లేకపోతే అది డబ్బెలా అవుద్ది!
బిత్తరపడి చస్తూ తను చూస్తోంటే బెబ్బులిలా జబ్బట్టుకొని........
అబ్బ!

బిగ్గరగా అరవాలనిపించింది. అంతలోనే ఆడమనసు అడ్డుపడ్డంది. నిజవేఁ. నలుగురిలో పరువు పోటం తప్ప పోయిన పరువు తిరిగి రాదు గంద. మైకంలో మగాడి దగ్గరకు అంత రాత్రపుడు అప్పుకెళ్లానంటె నలుగురూ తన్నే అంటారు—తాటిచెట్టూ దూడమేతని.

*  *  *  *

యాపిల్ పళ్లు సఫా అయ్యాయి.
నెమరు వేత పూర్తయింది.
దూడమేత!
తాడిచెట్టు తలుపు తట్టింది.
మేతమేసిన లేగదూడ అంగలార్చుకుంటూ తీసింది!
తాడిచెట్టే దూడమేతకొచ్చింది!
అని తాడినెవళ్లా అన్రు!

# కసి

— నవీన్

ఈ రాత్రికి మా నాన్నను హత్యచేయాలని నిశ్చయించుకున్నాను. మా గుడిసెలోపడుకొని ఎప్పుడొస్తాడా అని ఎదురుచూస్తున్నాను. రాత్రి పది గంటలు దాటింది.

మా గుడిసెపక్క చింతచెట్టు కొమ్మల్లో గుడ్లగూబ వికృతంగా అరుస్తోంది. పక్క గుడిసెలో ముసలాడు ఖంగు ఖంగు మని దగ్గుతున్నాడు. దూరంగా మరో గుడిసెలో చంటిపిల్ల గుక్కపట్టి యేడుస్తోంది. ఎలక్ట్రిక్ దీపస్తంభం దగ్గర రెండు కుక్కలు పోట్లాడుకుంటూ అదేపనిగా మొరగుతున్నాయి. దూరంగా మెయిన్‌రోడ్డు మీద కారు హారన్ చప్పుడు, రిక్షా వాళ్ళ చప్పుడు. మొదటి ఆట వదిలినట్టున్నారు. ఎక్కడా గాలి వీచటం లేదు. శరీరమంతా చెమటలు కారుతున్నాయి. నా పక్కనే తమ్ముడు, చెల్లెలు నిద్రపోతున్నారు. అమ్మ ఆసుపత్రిలో ఉంది.

యేమైనా సరే. ఈ రాత్రికి మా నాన్నను హత్యచేసి తీరాలి. అప్పుడే గాని నా కసి చల్లారదు. ఈ కుటుంబం బాగుపడదు.

వస్తాడు ఇంకాస్సేపట్లో వస్తాడు. తప్పతాగి, పడుతూ లేస్తూ, తనలో తానే యేదో గొణుక్కుంటూ వస్తాడు. దొంగలా వస్తాడు. రాగానే కుండలు వెతుకుతాడు తినటానికి యేమన్నా ఉందేమోనని. మేమంతా తిన్నాక నాన్నకోసం ప్రతిరోజు కొంత అన్నం మిగిలించేది అమ్మ. యే అర్ధరాత్రో దొంగలా ఇంట్లో ప్రవేశించి, అది తిని నిద్రపోతాడు నాన్న. ఇవ్వాళ్ల కూడా నాన్న కోసం కొంత అన్నం ఉంచాను. అది తింటాడు. ఛస్తాడు. మా పీడ విరగడై పోతుంది ఇవ్వాళ్ళ నాన్నకోసం ఉంచిన అన్నంలో ఎండ్రిన్ కలిపాను. అతన్ని ఈ రాత్రి పరలోకం పంపించాలని నిశ్చయించుకున్నాక నేను వేసిన పథకం అదే. మాపక్క గుడిసెల వాళ్ళల్లో కొందరు కూరగాయలు పండిస్తారు. వాళ్ళ దగ్గర ఎండ్రిన్ డబ్బాలుంటాయి. మా గుడిసెలో కూడా కూరగాయల చెట్లు వేసాకుని, వాటికి పురుగు తగిలిందని ఆగ్రోమాటిక్ వాళ్ళదగ్గర కొంచెం ఎండ్రిన్ సంపాదించాను. అది నాన్నకోసం ఉంచిన అన్నంలో కలిపాను. పాపం ఆకలితో వస్తాడు. అది తింటాడు, ఛస్తాడు. అప్పుడు గాని నా గుండెలు కుదుట పడవు. అప్పుడు గాని నా కసి చల్లారదు.

ఇంతకూ, మా నాన్నను చంపాలన్న నిర్ణయం ఎందుకు తీసికున్నానో చెప్పొద్దూ?

మా నాన్న తాగుబోతు.
మా నాన్న పేకాటగాడు.
మా నాన్న సిగ్గు, శరం లేనివాడు.
మా నాన్న మా సంసారాన్ని పూర్తిగా నాశనం చేశాడు.

రెక్కలు విరుచుకొని మా అమ్మా, నేనూ సంపాదించిన డబ్బంతా దొంగ తనంగా ఎత్తుకు పోతాడు—

మమ్మల్నందర్నీ ఆకలితో చంపుతాడు. మా డబ్బు తీసుకుపోతుంటే అడ్డు పడిన అమ్మను, నన్ను చితుక బాదుతాడు.

మా నాన్నకు జాలిలేదు. క్రూరుడు. మా నాన్నది రాతిగుండె.
'నువ్వు ఛస్తేగాని మేము బాగుపడం' అంది అమ్మ ఎన్నోసార్లు.

అమ్మ నాకు చదువు చెప్పించాలనుకుంది. అమ్మ ఐదారుగురి ఇళ్లల్లో పని మనిషిగా కుదిరింది. నెలకు 30 రూపాయల వరకు సంపాదిస్తుంది. కాని అమ్మ డబ్బు తెచ్చిన తెల్లారే నాన్న ఆ డబ్బును మటుమాయం చేసేవాడు. అమ్మ ఎంత యేడ్చి మొత్తుకున్నా లాభం లేకపోయింది,

మాది చాలా చిన్నగుడిసె. ఆ గుడిసెలో నాన్నకు తెలియకుండా డబ్బు దాచటం సాధ్యమయ్యేదికాదు.

మా స్వంత ఊళ్లో ఉండగా నేను బడికి వెళ్లేవాడిని. కాని పట్నం వచ్చాక, మా ఇంటి పరిస్థితి చూసాక నేను చదువు కోవటం సాధ్యం కాదనిపించింది. యేదోలా అమ్మకు సహాయ పడాలనుకున్నాను. మా చుట్టుపట్ల గుడిసెల్లో ఉండే ఇద్దరు ముగ్గురు రిక్షా అన్నయ్యల సహాయంతో రిక్షా లాగటం నేర్చుకున్నాను. వాళ్లే నాకో రిక్షా కూడా యిప్పించారు. పన్నెండు యేళ్లయినా నిండని నేను రిక్షా లాగటం చూసి అమ్మ బావురుమంది.

మా కుటుంబం ఒకప్పుడు బాగా ఉన్నకుటుంబమేనని అమ్మ చెబుతుంది. మా నాన్న వాళ్ళ అమ్మకు వొక్కడే కొడుకు. పుట్టగానే పొట్టబెట్టుకున్నాడు. తండ్రి

లేదు. వొక్కడే కొడుకు. వాళ్ళ అమ్మ మా నాన్నను అతిగారాబంగా పెంచింది. చిన్ననాటినుండి ఇతడు ఎంతంటే అంత—యేదంటే అది. చిన్ననాటినుండి నాన్నకు తాగుడు అలవాటయ్యింది. ఎవరైనా బంధువులు వచ్చినప్పుడు వాళ్ళకోసం కల్లు సారాయిలు తేవటం మా యిళ్ల లో ఆచారం. వాటిని నాన్న నెమ్మదిగా అలవాటుచేసి కున్నాడు. మొదట్లో ముద్దుకోసం, సరదాకోసం పెద్దవాళ్లే అవి అతనికి రుచి చూపించారు. త్వరలోనే నాన్న వాటికి బానిస అయ్యాడు. బడికి పంపించినా నాన్నకు చదువుమీద ఎన్నడూ అభిలాష లేదు. చదువు వంకతోనే బస్తీకి వెళ్లాడు. బస్తీకి వెళ్లాక నాన్నకు తాగుడేకాకుండా పేకాటకూడా అలవాటయ్యింది. పేకాట, తాగటం-24 గంటలు యిదేపని. అప్పులు వంచలకు వందలు దాటాయి. కొడుకు బస్తీలో నిజంగానే చదువుకుంటున్నాడని, వాళ్లమ్మ భూమి తాకట్టుపెట్టి వేలకువేలు అప్పులుచేసి డబ్బు పంపించింది.

మెట్రిక్‌లేషన్ పరీక్ష రెండు మూడుసార్లు తప్పాక నాన్న యింటికొచ్చాడు. అప్పుడే పెళ్ళయ్యింది. ఒక్కడే కొడుకు, బాగా ఉన్నవాళ్ళేననే అభిప్రాయంతో అమ్మను యిచ్చారు. కాని పెళ్లినాటికే ఆ కుటుంబం పూర్తిగా అప్పుల్లో మునిగిఉన్న సంగతి అమ్మవాళ్లకు తెలియదు.

నాన్నకు వ్యవసాయం చేయటంగాని, చేయించుకోవటంగాని చేతకాలేదు—అప్పులుచేసి కూర్చొని తినటానికి అలవాటు పడ్డాడు. అమ్మ కాపురానికొచ్చాక ఐదారేళ్లలోనే ఆ యిల్లు పూర్తిగా గుల్లయిపోయింది. అప్పుల క్రింద ఎకరం తర్వాతఎకరం ఎగిరిపోయింది. మరో రెండు మూడేళ్ల లో మా కున్న ఐదారువేలు ఖరీదుచేసేయిల్లు కూడా అప్పుల క్రింద జప్తు అయిపోయింది. మా యిల్లు జప్తుఅయినరోజే మా నాయనమ్మ మంచమెక్కింది. ఆ తర్వాత కొద్దిరోజులకే ఆమె చనిపోయింది. ఆమె చనిపోవటం నాకు బాగా జ్ఞాపకం.

నా చిన్నప్పుడు చాలాసార్లు అమ్మ నన్ను దగ్గరకు తీసుకొని గుండెలకు హత్తుకుంటూ గంటలకు గంటలు యేడ్చేది. అమ్మ అలా యేడుస్తున్నప్పుడు నేనూ యేడ్చేవాణ్ణి. అంత చిన్నప్పుడుకూడా అమ్మ యేడ్పుకు కారణం ఎవరో నాకు తెలిసింది. అమ్మ యేడ్పుకు కారణం నాన్న అని నా చాలా చిన్న వయస్సులోనే గుర్తించాను. ఎందుకో నాన్న దుష్టుడు, క్రూరుడు, నాకు అమ్మకు శత్రువనే అభిప్రాయం నాలో అప్పుడే స్థిరపడింది. అనాడే నిర్ణయించుకున్నాను, నాన్నబారి నుండి అమ్మను రక్షించి, అమ్మను సంతోషపెట్టాలని.

సర్వస్వం కోల్పోయాక, ఆ వూళ్ళో వుండి చేసేదేముంది? పట్నం వెళితే

అదో యిదో పనిచేసుకొని బతకవచ్చని అమ్మకెవరో సలహా యిచ్చారు. మా ఊరి వాళ్ళు యిద్దరు ముగ్గురు పట్నంలో డబ్బున్నవాళ్ళ యిళ్ళల్లో పనిమనుషులుగా కుదిరి కాస్త సుఖంగానే బతుకుతున్నారని తెలిసింది. వాళ్ళ సహాయంతోనే పట్నం చేరాము. వాళ్ళ సహాయంతోనే ఈ గుడిసెకూడా అద్దెకు సంపాదించాము.

మొదట మాతో పట్నం రావటానికి నాన్న వొప్పుకోలేదు. కాని మేము పట్నం చేరిన నాలుగైదు రోజులకే నాన్నకూడా వచ్చి మాతో కలిసాడు. ఈ లోపల అమ్మ ఐదారు యిళ్ళల్లో పనిమనిషిగా కుదిరింది.

నాన్న పట్నంలోకూడా త్వరలోనే కొంతమంది స్నేహితులను సంపాదించాడు. వాళ్ళంతా మా గుడిసె చుట్టుపట్ల వున్న గుడిసెల్లో వుండేవాళ్ళే. అంత పేదవాళ్ళయినా వాళ్ళకుకూడా తాగుడు, పేకాట అలవాటుండటం నన్ను చాలా ఆశ్చర్యపరచింది.

నాన్న వాళ్ళతో చేరాడు. గుడిసెంతా శోధించి, ఎక్కడ నయాపైసవున్నా ఎత్తుకుపోయేవాడు. ఎక్కడా డబ్బు దొరకనప్పుడు అప్పులుచేసేవాడు. అప్పుల వాళ్ళు వచ్చి అమ్మను అడిగేవాళ్ళు.

అమ్మ నాన్నను నోటికొచ్చినట్లల్లా తిట్టేది! నాన్న అమ్మను కొట్టేవాడు. అడ్డుపడబోతే నన్నుకూడా రెండు బాదేవాడు.

చాలాసార్లు మాకు తిండే ఉండేదికాదు. ఆకలితో తమ్ముడూ, చెల్లాయి యేడ్చి యేడ్చి సొమ్మసిల్లి పడిపోయేవారు. అమ్మ వాళ్ళను గుండెలకు హత్తుకొని గంటలకు గంటలు కుమిలి కుమిలి యేడ్చేది. యే అర్థరాత్రో, నాటుసారా తాగి ఏవో పిచ్చి పాటలు పాడుకుంటూ నాన్న వచ్చేవాడు. ఆ క్షణంలో నాన్నను చూస్తే నాకు వళ్లు మండిపోయేది. అతన్ని ముక్కలు ముక్కలుగా నరికి పారేయాలన్నంత కసి నన్ను కాల్చివేసేది.

పట్నం వచ్చిన రెండేళ్ళ తర్వాత నేను రిక్షా లాగటం మొదలెట్టాను. నేను రిక్షా లాగటం మొదలెట్టినప్పటినుండి మా పరిస్థితి కొంచెం మెరుగైంది. రోజుకు రెండురూపాయలవరకు సంపాదించేవాడిని. అయితే ఆ డబ్బు ఎప్పుడూ యింటికి తెచ్చేవాడినికాదు. వెంటనే కొట్టుకెళ్ళి బియ్యం మొదలైన తిండికి కావలసిన వస్తువులు కొనుక్కొచ్చేవాడిని.

నేను యింకోపనికూడా చేశాను. మా గుడిసెమధ్య చిన్నగుంట త్రవ్వి

దాంట్లో వో చిన్న డబ్బా పాతిపెట్టాను. ఎప్పుడైనా అమ్మదగ్గరగాని, నా దగ్గరగాని యేమాత్రం డబ్బు మిగిలినా దాంట్లోనేవేసేవాళ్ళం. అక్కడ గుంట ఉన్నట్లు నాన్నకు తెలియకుండా మామూలుగా మీద మట్టి కప్పేసాను.

నాన్నకు ఆ డబ్బు సంగతి తెలియలేదు. డబ్బు కోసం గు సెంతా వెతికే వాడు. నాన్నకు అప్పులిచ్చేవాళ్ళకు, సారాయి దుకాణం వాడికి గట్టిగా చెప్పాము మా నాన్నకు నయాపైసా అప్పు యివ్వవద్దని, యిచ్చినా మేము తీర్చేది లేదని.

ఇది జరిగాక నాన్న కాలుగాలిన పిల్లిలా తిరుగ సాగాడు. అమ్మను బతి మాలాడు. యేడ్చాడు. తాగకుండా బతకలేనన్నాడు. "బతకలేకపోతే చావు" అంది అమ్మ.

నా దగ్గరికొచ్చాడు. నన్ను బతిమాలాడు. డబ్బుంటే యివ్వమన్నాడు. తనకు పేకాటలో వస్తుందని, నా డబ్బు నాకు తిరిగి యిచ్చేస్తానని, నన్ను నమ్మించటాని. ప్రయత్నించాడు. "నయాపైసాకూడా యివ్వ"నన్నాను. "నాతోపాటు రిక్షాలాగ" మన్నాను. "నేను ఎంతగొప్ప కుటుంబంలో పుట్టాను. రిక్షాలాగుతాన్రా" అంటూ నన్ను బూతులు తిట్టాడు. అమ్మను కూడా తిట్టాడు. అమ్మను పూర్వంలా కొట్టబోయాడుకి నేను అడ్డుపడ్డాను. "అమ్మ మీద ఒక్కదెబ్బ పడితే నీ బొక్కలు విరుగుతాయని" చెప్పాను. నేను చిన్నవాడిగా ఉన్నప్పుడు అమ్మను కొడ్తూంటే చూస్తూ ఊరుకునేవాడిని కాని యీ మధ్య రిక్షాలాగుతూ కొంత సంపాదిస్తున్న నాటినుండి నాలో ఆత్మవిశ్వాసం పెరిగింది. అవసరమొస్తే నాన్ననే కొట్టగలనన్న ధైర్యం కలిగింది.

కొన్ని రోజులుగా పేకాట తాగుడు లేకపోవటమువల్ల నాన్నపిచ్చివాడైపోయాడు పదేపదే అమ్మదగ్గరకొచ్చి యేడ్వటం మొదలెట్టాడు. ఉరేసుకొని ఛస్తానన్నాడు. అమ్మ యే సంకోచం లేకుండా 'చావు' అంది. "నువ్వు ఎంత త్వరగా చస్తే నా పిల్లలు అంత త్వరగా బాగుపడతా"రంది. ఈ మాట వినటంతోటే నాన్న బోరున యేడ్చాడు. అమ్మ కూడా యేడ్చింది.

* * * *

ఈ రోజు నేను రిక్షతీసికొని సినిమాహాలు వైపు వెళ్ళాను. వెళ్ళే ముందు డబ్బాలో కొంత చిల్లర వేశాను. డబ్బాలో నెల రోజులుగా వేస్తున్న చిల్లరంతాకలిసి పది రూపాయలైనా వుంటుందనుకున్నాను. ఒకటిరెండు రోజుల్లో ఆ డబ్బు తీసిఅమ్మ కొక చీర కొనుక్కురావాలను కున్నాను. అమ్మకు బొత్తిగా చీరలు లేవు.

చాలా సేపటివరకు ఎవరైనా దొరుకుతారేమోనని సినిమాహాలు దగ్గర ఎదురు చూస్తున్నాను. దూరంగా మా తమ్ముడు నా కోసం పరుగెత్తుకుంటూ రావడం కనిపించింది. ఎదురుగా వెళ్ళాను.

వాడు యెగపోస్తూ, యేడుస్తూ........

"నాన్న అమ్మతల పగలగొట్టాడు" అని చెప్పాడు. నా గుండెలు అదిరాయి. వాడిని రిక్షాలో కూర్చోపెట్టుకొని గుడిసెవైపుగా పోనిస్తూ యేం జరిగిందో చెప్పమన్నాను.

"ఎవరూ లేరు. ఇప్పుడే వస్తానని అమ్మ బజారువెళ్ళింది. చెల్లాయి నిద్ర పోతోంది. నాన్న వచ్చాడు. ఎప్పటిలా యిల్లంతా వెతికాడు. నువ్వు యింటాక డబ్బాలో పైసలు వేసినప్పుడు మట్టి సరిగా కప్పనట్టున్నావు. అందువల్ల నాన్న ఆ చోటు కను క్కున్నాడు. మట్టి తీసేసి డబ్బా బయటకు తీసాడు. నేను పరుగెత్తుకెళ్ళి నాకు ఎదురుగా వస్తున్న అమ్మతో చెప్పాను. అమ్మా, నేను గుడిసెకు పరుగెత్తాము. డబ్బంతా కండువలో కుమ్మరించుకొని మూటకట్టాడు నాన్న. అమ్మ 'ఆ డబ్బు అక్కడపెట్టు' అని అరిచింది. నాన్న వినలేదు. అమ్మ అడ్డుపడింది. ఆ కండువా లాక్కోవటానికి ప్రయత్నించింది. నాన్న అమ్మను పక్కకు తోసాడు. కిందపడిపోయింది. అయినా లేచి నాన్నకాలు పట్టుకొని వెళ్ళనివ్వలేదు. నాన్న చేతికి అక్కడేఉన్న కర్ర—నువ్వు కుక్క కొట్టటానికని తేలేదు! ఆ కర్ర దొరికింది. ఆ కర్రతో అమ్మతలమీద రెండు మూడు దెబ్బలు గట్టిగా వేసాడు. అమ్మతల పగిలిపోయింది. అంతా రక్తమే. నాన్న డబ్బు పట్టుకొని ఉడాయించేసాడు."

"వాడు చెప్పటం ముగించి యేడ్వటం మొదలెట్టాడు. అమ్మ చచ్చిపోతుందా అన్నయ్యా" అంటూ వెక్కి వెక్కి యేడ్వసాగాడు. నా కళ్ళల్లో గిర్రున నీళ్ళుతిరిగాయి. అమ్మ చనిపోతుందన్న ఊహ రావటంతో నా గుండెలు భయంతో వణికాయి.

గుడిసె చేరాము. చాలామంది మా చుట్టుపక్కలవాళ్ళు మా గుడిసెనిండా మూగారు. లోపలకెళ్ళి అమ్మను చూసాను. రక్తపు మడుగులో అమ్మ—అమ్మకు స్పృహలేదు. అమ్మ బతుకుతుందన్న ఆశ నాలోలేదు. "అమ్మ" అంటూ అమ్మమీద పడి యేడ్చాను. చుట్టుపక్కలవాళ్ళు నన్ను ఓదార్చి వెంటనే ఆసుపత్రికి తీసికెళ్ళమని సలహా యిచ్చారు. అమ్మను రిక్షాలో వేసికొని ఆసుపత్రికే తీసికెళ్ళాను. ఆసుపత్రిలో చేర్పించి, అమ్మ గాయాలకు కట్లు కట్టించాక యింటికొచ్చాను.

అమ్మను అలా రక్తపు మడుగులో చూసినప్పుడే అనుకున్నాను, నాన్నను

ఈ రోజు యమలోకం పంపించి వేయాలని. అతడు ఛస్తేగాని మేము సుఖంగా ఉండలేము. అతడు ఛస్తేగాని ఈ యింటిని పట్టిన శని వదలదు.

*       *       *       *

పోలీసు హెడ్‌క్వార్టర్స్‌లో పదకొండు గంటలు కొట్టారు.

నాన్న ఏ క్షణంలోనైనా రావచ్చని ఊపిరి బిగపట్టి ఎదురు చూస్తున్నాను.

చింతచెట్టు కొమ్మల్లో గుడ్లగూబ అలాగే అరుస్తోంది. పక్క గుడిసెలోని ముసలాడు అలాగే ఖంగు ఖంగుమని దగ్గుతున్నాడు. ఎలక్ట్రిక్ స్తంభం దగ్గర పోట్లాడుకుంటున్న కుక్కలు ఎటో పారిపోయాయి. దూరంగా చంటిపిల్ల యింకా యేడుస్తోనే ఉంది.

ఈ రోజు నాన్న రావటం చాలా ఆలస్యం అయ్యింది. రోజూ పదిగంటల వరకే వచ్చేవాడు. ఈ రోజు చేతినిండా డబ్బుంది. ఇంకా సారా దుకాణంలోనే ఉండి ఉంటాడు.

నాన్నను హత్య చేస్తున్నానన్న బాధ నాలో యేకోశానా లేదు. నేను యేదో తప్పుచేస్తున్నానని కూడా నాకనిపించలేదు. అతడు చావటం మా కుటుంబానికి చాలా అవసరం. అతడు ఛస్తేగాని నేనూ, అమ్మా, తమ్ముడు, చెల్లి ఈ లోకంలో బతుకలేం. అతడి వొక్కడి కోసం మేము నలుగురం ప్రతిరోజూ ఆకలితో చావటం చాలా ఘోరమైన అన్యాయం కాదంటారా?

గుడిసె బయట అడుగుల చప్పుడు. దిగ్గున లేచి కూర్చున్నాను. వచ్చేస్తున్నాడు. ఎందుకో రెండు చేతులతోను కడుపు పట్టుకున్నాడు. సరిగ్గా నడవలేకపోతున్నాడు. వంకర్లు తిరిగి పోతున్నాడు. మామూలు కంటె తాగుడు ఎక్కువై ఉంటుందనుకున్నాను. దగ్గర కొచ్చాడు. గుడిసెలో ప్రవేశిస్తూనే రెండుచేతులా కడుపు కొట్టుకుంటూ దభీమని నేలమీద విరుచుక పడ్డాడు. నేను దగ్గరకెళ్ళి కర్కశంగా అన్నాను.

"దొరగారి కివ్వాళ్ల తాగుడు బాగా ఎక్కువైనట్లుంది"

కడుపు కొట్టుకుంటూనే

"ఆ! తాగాను........తాగానురా........చావటానికి తాగాను....ఛస్తున్నాను....అమ్మో....అమ్మో" భయంకరంగా కేకలు వేయసాగాడు. ఆ కేకల్లో విపరీతమైన బాధ.

కడుపు కొట్టుకుంటూ నేలమీద అటుయిటూ దొర్లసాగాడు. తల కోసేసిన కోడిలా కొట్టుకో సాగాడు. నాకు భయమేసింది. ఎందుకో నాన్న యే క్షణంలోనైనా చచ్చిపో వచ్చనిపించింది. నాన్న మీద జాలి కల్గింది.

"యేమైంది నాన్న....యేమైంది" అన్నాను అతన్ని గట్టిగా పట్టుకుంటూ.

"చచ్చిపోతున్నానురా!....చచ్చిపోతున్నాను....మీ అమ్మ యేది! ఒక్కసారి నా దగ్గరకు తీసుకురావూ! మీ అమ్మకు అన్యాయం చేశానురా! నన్ను క్షమించదు.... కాని ఒక్కసారి నా దగ్గరకు తీసికురావూ?"........చాలా దీనంగా అన్నాడు.

అమ్మ యిక్కడెక్కడుంది నాన్నా....నువ్వే కొట్టావుగా....ఆసుపత్రిలో ఉంది".

"ఔను....కొట్టాను....నేను రాక్షసుణ్ణిరా....మీ పాలిటి యముణ్ణి. కాని పోతున్నాను. మీ పీడ విరగడై పోతుంది! ఇకనైనా హాయిగా ఉండండిరా...."

"ఇంతకూ యేమైంది నాన్నా".

"మీరు దాచిన డబ్బు తీసికెళ్ళానా....సారా దుకాణంవాడు ఆ డబ్బంతా తీసి కొని నాకు ఒక్కచుక్కకూడా సారా పొయ్యలేదు. ఆ డబ్బంతా పాత బాకీ కింద చెల్లు అన్నాడు. నాకు పిచ్చెక్కింది. వాడితో పోట్లాడాను. వాడి మనుషులతో బాగా తన్నించి చెత్తకుండీలో పారేయించాడు".

ఇక చెప్పలేక పోయాడు. అతని బాధ యింకా ఎక్కువైంది. దభీదభీమని చేతులతో కడుపు బాదుకోవటం మొదలెట్టాడు—ఇంగలు చుట్టుకుపోయాడు. నోట్లోంచి నురుగులు కక్కసాగాడు. మళ్ళా చెప్పసాగాడు.

"ఎండ్రిన్ తాగానురా....ఎండ్రిన్-ఇక్కడే మన గుడిసెల్లోనే కూరగాయలు పండించే వాళ్ళ లేరూ........అక్కడే సంపాదించాను....అమ్మో...బాధ...చచ్చిపోతు న్నాను...అమ్మో... మీ అమ్మను ఒక్కసారి చూపించవూ?....ఔను...లేదుగదూ....కొ ట్టాను...చంపాను...అందుకే చస్తున్నా(న్రా. నా జీవితంలో చేసిన మంచి పని ఇదొ క్కటే. దౌర్భాగ్యుణ్ణి పోతున్నాను...అమ్మో..."

నాన్న వెర్రిగా అరచాడు. "ఎండ్రిన్ తాగాను" అన్నమాట వినగానే నాన్నను చంపింది నేనే అనే భయం నాలో అతి వేగంగా వ్యాపించింది. నా కాళ్ళు చేతులు ఆడ

లేదు. నేను హంతకుణ్ణి. నన్ను పోలీసులు పట్టుకు పోతారు. లేచి పారిపోవాలి. కాని నా కాళ్ళు భూమిలో కూరుకు పోయాయి. కదల లేక పోతున్నాను. కుప్పలా కూలి పోయాను. నాన్న అలాగే వెర్రిగా అరుస్తున్నాడు. భయంకరంగా మూలుగుతున్నాడు. అటూఇటూ కొట్టుకొంటున్నాడు. నాన్నకేసి చూడలేక పోయాను. నేనే హంతకుణ్ణనే భయం నా గుండెల్ని నులిమి వేసింది.

ఆకస్మాత్తుగా నాన్న మూల్గటం మానేసాడు. కొట్టుకోవటం మానేసాడు. నాన్న కాళ్ళచేతులు చల్లబడ్డాయి. అయిపోయింది నాన్న చచ్చి పోయాడు. "నాన్నా" అంటూ నాన్న శవం మీద పడి కుళ్ళికుళ్ళి యేడ్చాను.

# వీడ్కోలు *

—అత్తలూరి నరసింహారావు

ఇక్కడ అందమైన కుర్చీలుగానీ, వాటిముందు అంతకన్నా అందమయిన టేబుల్స్‌గాని వుండవు. దానికి అందమయిన ద్వారం లేదు. ద్వారానికి అందమయిన తలుపులు లేవు. అక్కడ క్యాష్ బాక్స్ వుండదు. బాక్స్ ముందు బొజ్జపెరిగిన శాల్తీ వుండదు. 'ఏం కావాలి సార్' అని వినయవిధేయతలతో వ్యాపార సరళితో మనల్ని పలకరించే సర్వేశ్వరులుండరు. శుభ్రమయిన తెల్లని వాష్ బేసిన్‌లుండవు. బేసిన్‌ల దగ్గర అద్దాలుండవు. వాటర్ బాటిల్లు ఉండవు, స్వీపర్లు అసలే వుండరు. అక్కడ మెనూలుండవు. స్టీల్ గ్లాసులు గాని, గాజుగ్లాసులు గాని, అందమయిన కప్పు సాసర్లు గాని వుండవు. టుడేస్ స్పెషల్ బోర్డు అసలే వుండదు. స్పెషల్ స్వీట్స్‌కి స్పెషల్ గాజు గది వుండదు, లోపల ఎయిర్ కండిషన్డ్ గది వుండదు, అక్కడ తిన్న దానికి కాగితపు బిల్లులుండవు. అక్కడ కుటుంబం మొత్తం కూర్చుని తినటానికి ప్రత్యేకమైన గది వున్నట్లు సూచించే బోర్డు లేదు. అక్కడ రాజకీయ నాయకుల ఫోటోలు గాని, పాపాల ప్రతినిధులైన దేవుళ్ళ ఫోటోలు గాని అమర్చి లేవు. నెత్తిమీద ఫాన్‌లుండవు. అది వెంకాయమ్మ హోటలు, హోటలు పేరు సూచించే బోర్డు వుండదు: సదరు వెంకాయమ్మే ఆ హోటలుకు బోర్డు.

"సత్యం, ఈయనకు ఆరిడ్లీ, నాలుగు వడ సాంబారు తీసుకురా" కేకవేసింది వెంకాయమ్మ. వచ్చిన వ్యక్తి ఎదురు బెదురుగా చూస్తున్నాడు. ఆర్డరిచ్చినవి ఎప్పుడు వస్తాయా అని ఆత్రుతతో చూస్తున్నాడు. సత్యం ఇడ్లీలు, వడలు రేకు ప్లేటులో పెట్టి తీసుకు వచ్చి చేతికిచ్చి, అక్కడే తినేసిన రేకు ప్లేటొకటి తీసుకొని పోయాడు. తరు

---

* [కళాశాల విద్యార్థుల కోసం మేము నిర్వహించిన కథల పోటీ పట్ల కళాశాల విద్యార్థులు మేము ఆశించినంత ఉత్సాహాన్ని కనబరచలేక పోయారు. మాకందిన కొద్ది కథల్లో మేము ప్రకటించిన బహుమతిని అందుకోగల స్థాయి యే కథకూ లేదని మేము భావించాము. పోటీకి వచ్చిన కథల్లో "వీడ్కోలు" అన్న ఈ కథను ప్రశంసకు మాత్రమే అంగీకరించినాము. ఈ కథను రచించిన విద్యార్థి శ్రీ అత్తలూరి నరసింహారావుగారు తిరుపతి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో బి. ఏ. తృతీయ చదువుతున్నారు—సంపాదకుడు]

వాత రేకు గ్లాసుతో మంచినీళ్ళు తెచ్చి, బెంచి కింద కాళ్ళ దగ్గర పెట్టాడు. తింటున్న వ్యక్తి భయం భయంగా వున్నాడు. అతని చేతులు వణుకుతున్నాయి. అతను దారుణమయిన ఆకలితో వున్నాడనటానికి నిదర్శనం అప్పుడే రెండుబజ్జీలు, రెండువడలు తినటం; మంచినీళ్ళ గ్లాసులో వున్న నలకల్ని, వుల్లిపాయ పొట్టుని లెక్క చేయక గటగటా మంచినీళ్ళు త్రాగటం.

సత్యం మంచి నటుడు. ముఖ్యంగా బహుపాత్రాభినయం బాగా చేస్తాడు. ఉదాహరణకి అతనే సప్లయర్, అతనే క్లీనర్, అతనే ప్రొప్రయిటర్. అప్పుడప్పుడు ముసలి వంటావిడ మంచాన పడితే అతనే హెడ్ కుక్. సన్నగా మగాడిలాగా వుంటాడు. తనే వెంకాయమ్మను వుంచుకున్నానంటాడు. తనే సత్యాన్నుంచుకొన్నానంటుంది వెంకాయమ్మ. వయస్సులో సత్యం చిన్నవాడు. వారిద్దరికి వయసులో రాజీ లేకపోయినా, అనుభవాలను పొందటంలో బాగా రాజీ కుదిరింది. వారిద్దరు ముద్దుముద్దుగా ఒకరినొకరు 'సత్యం' అని 'వదినా' అని పిలుచుకుంటారు.

వెంకాయమ్మ దుబ్బరోటిలా వుంటుంది. కళ్ళు వడల కుండే బెజ్జంలా వుంటాయి. బుగ్గలు ఇడ్లీల్లా వుంటాయి. వీపు రెండు దోసెల వెడల్పు వుంటుంది. కాళ్ళు చేతులు కడ్డివేళ్ళలా వుంటాయి. చేతివేళ్ళు బజ్జీల్లా వుంటాయి. తలకాయ బోండాంలా వుంటుంది. నడుం దుబ్బరోటి పత్రంలా వుంటుంది. తొడలు అరటిస్తంభాల్లా ఉంటాయి. ఆమె జుట్టులో అక్కడక్కడ ముసలి దశను సూచించే లక్షణాలున్నాయి. తల దువ్వుకోటానికి దువ్వెనున్నా టైముగాని, శ్రద్ధగాని లేదు. స్నానానికి నీళ్ళున్నా మార్చడానికి చీర లేదు.

ఎవరో లోపలికి వచ్చి బెంచి మీద కూర్చున్నాడు. అక్కడున్న ఈగలన్నీ ఒక్కసారి ఎగిరిపోయి మరెక్కడో మూగాయి. అతను పై పంచతో ముఖం తుడుచుకుంటూ "మంచి వేడి పెసరట్ ఒకటి పట్రా" అని కాస్త జరిగి కూర్చున్నాడు. బెంచి క్రిందఉన్న గ్లాసు కాలికి తగిలి వున్ననీళ్ళు కింద పోయాయి. ప్రక్కనే చెయ్యికడిగిన ప్లేటుంది. ఒక్కసారి ఈగలు ఎగిరి మళ్ళీ ప్లేటుమీద వాలాయి. "కాళ్ళ క్రింద గ్లాసులు పెడితే ఎలా వెంకాయమ్మా" అని తన పంచెను పైకి తీసుకున్నాడు తడవకుండా. అతను ఇంకాస్త జరిగి కూర్చుందామని బెంచీ వైపు చూశాడు. అక్కడ తడిగా వుందనటానికి నిదర్శనంగా నీళ్ళు చిన్న మడుగులుగా వున్నాయి. బెంచీ మీద ఎంగిలి ఉందనటానికి నిదర్శనంగా అక్కడ ఈగలు ముసిరి ఉన్నాయి. మూలనున్న మంచినీళ్ళ కుండ దగ్గర ఒక కుక్క పడుకునుంది. అక్కడే ఒక రేకుగ్లాసు పడివుంది. కుక్కపిల్ల ఒకటి బెంచీల చుట్టూ తిరుగుతోంది.

"వదినా ఈయన దగ్గర అరవై పైసలు తీసుకో" వెంకాయమ్మకు ఇడ్లీలు వడలు తిన్నతన్ని చూపిస్తూ, పెసరట్ అడిగినాయన చేతికి పెసరట్ ప్లేటు అందించి లోపలి కెళ్ళాడు సత్యం. మామూలుగా వెంకాయమ్మ లోపలి వైపుకు తిరిగి సత్యంతో కావలసిన సరకుల గురించి అడుగుతుంది. పైసలివ్వ వలసి నాయన నెమ్మదిగా భయం భయంగా లేచాడు. ధైర్యం తెచ్చుకొని నెమ్మదిగా వెంకాయమ్మ చూడకుండా గబగబా గుమ్మందాటి నడిచిపోయాడు. "వెంకాయమ్మా ఆయన డబ్బులిచ్చాడా?" పెసరట్ తింటున్నతను పెసరట్ తుంచి అల్లం పచ్చడి కద్ది నోట్లో పెట్టుకునడిగాడు. "ఎవడూ" అంటూ తన భారీ శరీరాన్ని వెనక్కి తిప్పిచూసింది. (వెంకాయమ్మకు మర్యాదగా మాట్లాడాలని తెలుసు, కాని మాట్లాడ లేదు.) "వాడే, ఆ వెళ్ళేవాడు" అన్నాడు అప్పుడే అరఫర్లాంగు దూరం వెళ్ళినతన్ని చూపిస్తూ. పైసలు లేని మనిషి చకచకా నడుస్తున్నాడు, అడ్డం వచ్చిన మనుషుల్ని రాసుకుంటూ వాహనాల్ని తప్పించుకుంటూ. "ఓరి లంజాకొడకా" అంటూ ఆవిడ పరుగు ప్రారంభించింది. (అది వెంకాయమ్మ దృష్టిలో చాలా వేగంగా పరుగెత్తడం. కొందరి దృష్టిలో అది చకచకా నడవటం. వెంకాయమ్మను జీవితంలో మొదటిసారిగా పరుగెత్తించింది ముఖ్యంగా లావయిన తరువాత, ఆ పైసలివ్వవలసిన మనిషి; అతనికి ధన్యవాదాలు.)

"వాణ్ని పట్టుకోండయ్యో, వాణ్ని పట్టుకోండయ్యో దొంగనాబట్టని" అంటూ కేకలేస్తూ పరుగెత్తుతోంది. ఎవరిని పట్టుకోవాలో, ఎవరిని దొంగనా బట్టంటుందో వెళ్ళే జనానికి తెలియక వెళ్ళిపోతున్నారు. ఈ విషయం తెలుసుకున్న సత్యం వంటావిడను చూస్తూ వుండమని చెప్పి తనూ పరుగెత్తాడు. పైసలు లేని మనిషి పరుగెత్తుతున్నాడు. వెంకాయమ్మ పరుగెత్తుతోంది. సత్యం వెంకాయమ్మను దాటి వేగంగా పరుగెత్తుతున్నాడు. పైసలు లేని మనిషి రోడ్డు వదలి రైలుకట్ట ఎక్కి పట్టాల వెంట పరుగెత్తుతున్నాడు. సత్యం తనూ రైలు పట్టాల వెంట పరుగెత్తు తున్నాడు.

కొద్ది దూరంలో రైలుస్టేషన్. ప్రక్క కాస్త ఖాళీ స్థలం రైలు కట్టనానుకొని కొంత దూరం వరకు వుంది. ఆ ఖాళీ స్థలం బారూతా అక్కడక్కడ పడిపోయిన ప్రహరీ గోడవుంది. ఆ గోడమీద ఏదేదో ఎప్పటినుంచో వ్రాసిన ఫలానాది మాత్రమే వాడండి అనే వ్యాపార ప్రకటనలు, ఫలానా వారికి ఫలానా గుర్తుమీదే ముద్రించి దయచేసి గెలిపించవలసినదిగ ఎలక్షను ప్రకటనలు, "తుపాకీ గొట్టం ద్వారానే రాజకీయాధికారం వస్తుంది", "తెలంగాణా విప్లవం వర్ధిల్లాలి" అనే చైతన్య రాజకీయ నినాదాలు వ్రాసివున్నాయి. (ఎవరో దుండగులు తుపాకీలోని 'తు' తెలంగాణాలోని 'తె''ణా'లు కావాలని చెరిపేశారు.) వర్షానికి ఆ గోడ బాగా నాని ఉంది. దిక్కులేని వాళ్ళు బలహీ

మనం జీవిత పోరాటంలో నలిగిపోయినట్టు, ఆ గోడనుండి అప్పుడప్పుడు రాళ్ళు క్రింద పడి నలిగిపోతాయి. ప్రహరీగోడ ప్రక్కనే రోడ్డు, రోడ్డుప్రక్కనే కొందరికి మాత్రమే ప్రవేశంగల పెద్ద హోటలు ఉన్నాయి. ఎంగిలిస్తరాకుల్లోని మిగిలిన అన్నాన్ని ఆత్రుతగా ప్రోగుచేసుకుంటున్నారు ఆ ఖాళీస్థలంలో యవ్వన దశలోకి వస్తున్న ముగ్గురు అభాగ్య జీవులు. హోటల్లో బాగావున్నవారు బాగా భోంచేసిన తరువాత, వారు అతి కరుణార్ద్రహృదయాలతో విస్తర్లో మిగిల్చిన హీనమైన ఖరీదైన కూడును, అతి వినయంగా యూనిఫారం సర్వర్లు ప్లాస్టిక్ బుట్టలతో ఆ ఖాళీస్థలంలో పారవేస్తుంటారు. (అది వాళ్ళ ఖర్మ అని కొందరు వక్రభాష్యం చెబుతారు).

అభాగ్య సమాజ సభ్యులైన ముగ్గురిలో ఒకతను నిక్కరు, బనియను వేసుకున్నాడు. నిక్కరు వెనక భాగం అరిగిపోయి చినిగివుంది. బనియనుకి ముందు భాగంలో అభిమాన సినీ నాయకుని ఫోటో రంగుతో అచ్చువేసి ఉంది. దుమ్ముకి ఆ మనిషన్నా, అతని నిక్కరన్నా, బనియనన్నా మహాప్రేమ ఉన్నట్టు దట్టంగా పట్టివుంది. మరొకడికి చొక్కా మాత్రమే ఉంది. దానికి గుండీలు లేవు. కనబడుతున్న ఎముకల్ని ఒకట్లు నేర్చుకున్న స్కూలు కుర్రాడు తప్పులేకుండా లెక్కపెట్టగలడు. చొక్కాకి ఒక జేబు మాత్రమేవుంది. ఆ జేబు కూడా సగభాగం చిరిగి క్రిందకు వ్రేలాడుతోంది. ఇంకొకడు ఎవరో, ఎప్పుడో ఇచ్చిన, లూజుగా బారుగావున్న పాంటు వేసుకున్నాడు. బారుగా వున్న పాంటుని తనకు సరిపడేంతవరకు మడతలు వేసాడు. మోకాలి దగ్గర పాంటు చినిగివుంది.

గుర్ గుర్ మంటూ అప్పుడే ఒక పంది శరీరానికి మట్టికొట్టుకొని, మూతికి పెంట రాసుకొని వచ్చింది. అంతకుముందే అక్కడున్న కుక్క దానిని చూసి కాస్త ప్రక్కకు జరిగింది. ఈ రెంటినీ చూసి ఒక ఆవు వచ్చింది. వీటన్నింటినీ చూసి కుర్రాళ్ళు కలిసి ప్రోగుచేసుకున్న అన్నాన్ని కాస్త దూరంగా తెచ్చుకొని పెట్టుకున్నారు. ఒకడు పాత డబ్బా పట్టుకొని వీధి కుళాయి దగ్గరకు వెళ్ళాడు. మిగిలిన ఇద్దరూ తదేకంగా, అమాయకంగా ఒకే దృశ్యాన్ని చూస్తున్నారు. ఎంగిలిస్తరాకుల మీదపడి మేస్తున్న వాటిని మరీమరీ తమ విశిష్టమైన చూపులతో చూస్తున్నారు.

వాళ్ళు కలిసి ప్రోగుచేసిన మిగిలిన అన్నం దేశానికి మిగిలిన అప్పులాఉంది. కాస్మోపాలిటన్‌లా, క్రాసింగ్ ది ఫ్లోర్‌లా వుంది. (ఆ కుప్పగావున్న అన్నం, మూగగా ఒక నగ్న సత్యాన్ని ఆ కుర్రాళ్ళకి మాత్రమే చెబుతుంది—ఆహార సమస్య ఈ ఆర్థిక సామాజిక రాజకీయ వ్యవస్థల్లో చస్తే తీరదని).

"వాడేయ్ అడ్ని పట్టుకోండ్రా" "దొంగ" దొంగ" అనే దారుణమైన కేక అజ్ఞతో కూడినది వాళ్ళ చెవినిబడి వెనక్కి తిరిగి చూశారు. రైలుపట్టాల వెంట వొకడు పరుగెత్తుకొస్తున్నాడు, వాడు అరపై పైసలూ లేని మనిషి. ఆకలితో వున్న మనిషి వెనకాలే మరొకడు అంతకన్నా వేగంగా పరుగెత్తుకొస్తున్నాడు. అతను సత్యం. ఏదో వేళకు కాస్త తిండి వున్న మనిషి. సుదూరంలో వొక లావుపాటి ఆడమనిషి మరికొందరితో కలిసి వేగంగా నడిచి వస్తోంది. ఆవిడ పేరు వెంకాయమ్మ. బోర్డు లేని హోటలుకి ప్రొప్రయిటర్.

తమ వర్గం వాడ్ని, తమలాగా దోపిడీకి గురైన వాడ్ని, తమ వర్గంలోనే దోపిడీకి గురవుతున్న వాళ్ళకు అమాయకులైన ఆ అభాగ్య జీవులు పట్టివ్వటానికి సిద్ధపడ్డారు. (ఇదంతా వాళ్ళకి తెలుసునని మనం అనుకుంటే అది మన తప్పు) వొక్కసారిగా కుర్రాళ్ళు రైలు కట్టమీదకి ఎక్కారు. "అడ్డం వచ్చారంటే చం పేస్తాను రోయ్" పైసలు లేని మనిషి పరుగెత్తుకుంటూ వస్తూ అన్నాడు. కుర్రాళ్ళు కొద్దిగా వెనక్కి తగ్గారు. "వాడేయ్ పట్టుకోండిరా పట్టుకోండిరా" ఆత్రుతతో కూడిన భీకరమైన కేక వెనకాలనుండి వినబడింది. అనాలోచితంగా వెంటనే వొక కుర్రాడు ముందుకురికి దగ్గరకొచ్చిన ఆ లేని మనిషిని గట్టిగా నడుం పట్టుకున్నాడు. వాడు కుర్రాడ్ని వొక్క తోపు తోసి పరుగెత్తుతున్నాడు. కుర్రాడు రైలుకట్ట క్రింద ఖాళీ ప్రదేశంలో పడిపోయాడు. వెంటనే ఇంకొక కుర్రాడు లేని మనిషి కాళ్ళు గట్టిగా పట్టుకొని వదలలేదు. కుర్రాడ్ని ఈడ్చుకుంటూ కొంత దూరం కాస్త తగ్గుస్థాయిలో పరుగెత్తాడు లేని మనిషి. కుర్రాడి మోకాలు రక్తం చిమ్మింది గులకరాళ్ళ రాపిడికి. అంతలో నీళ్ళకెళ్ళిన ముఠాతో కుర్రాడు నీళ్ళడబ్బా అక్కడ పారేసి మొండి ధైర్యంతో ఆ మనిషి నడుముని ఉడుం పట్టు పట్టాడు.

రొప్పుకుంటూ, చెమటలు కక్కుకుంటూ సత్యం పరుగెత్తుకొచ్చాడు. కుర్రాళ్లు లేని మనిషిని వదిలివేసి తమ రక్తానికి ప్రక్కనే వున్న దుమ్మును అద్దుపెట్టుకుంటున్నారు. సత్యం వాడ్ని కడుపులో వొకతన్ను తన్ని "ఏరా—లంజా—కొడకా—డబ్బు—లివ్వకుండా—పా-రి-పో-తా-వ-ట్రా—నా-కొడకా" అన్నాడు. ఊపిరి వేగంగా లోపలికి బైటికి పీలుస్తూ మళ్ళీ బలంగా వొకతన్ను తన్నాడు. అంతలో వెంకాయమ్మ ఇతర మనుషులతో వచ్చింది. చుట్టూ జనం చేరారు. తలా వొక తన్ను తన్నారు 'బాబోయ్', 'అమ్మబాబోయ్', 'కొట్టకండి,' 'అయ్యబాబోయ్' తన్నకండి 'బాబోయ్', అమ్మోయ్' 'కొట్టకండి' 'బాబోయ్' 'నాది తప్పే బాబోయ్', 'తప్పేబాబోయ్', 'క్షమించండి', బాబోయ్, అమ్మోయ్, బాబోయ్.

ఒక్కసారి కొట్టే చేతులన్నీ ఆగిపోయాయి. తన్నే కాళ్ళన్నీ ఆగిపోయాయి. తిట్టే నోళ్లన్నీ మూసుకున్నాయి.

నిశ్శబ్దానికి కారణం చట్ట రక్షకుడు పోలీసు. రోడ్డుమీద సైకిలికి స్టాండు వేసి వస్తున్నాడు. చేతిలో శనక్కాయల పొట్లంవుంది. దూరంగా పేవ్‌మెంటు మీద శనక్కాయలమ్ముకుంటున్న తాత ఈ పోలీసుని, చేతిలోవున్న పొట్లాన్ని కసిగా చూస్తున్నాడు.

పోలీసు అక్కడి వాళ్ళని "ఏవిటి సంగతి" అని వివరాలు అడుగుతున్నాడు. గుంపులో వాళ్ళు చట్టుబడ్డతన్ని తలా ఒక ప్రశ్న వేస్తున్నారు. వాడి సమాధానం చివర "య్యా", "సామి" అనే పదాలు మాటిమాటికి వస్తున్నాయి. వాడు మొత్తం మీద చెప్పిన సమాధానాల్లోని సారాంశం: పదిరోజుల్నించి అన్నం, తాయన ముఖం చూడ లేదట. కడుపులో ప్రేవులు ఫిరంగుల్లాగా శబ్దం చేస్తున్నాయట. ఈ పది రోజుల్లోను అతను ఏనిమిది పైసల టీలు రెండుసార్లు మాత్రమే త్రాగాడట. మూడోసారి ఎవరో బ్రతిమాలు కొంటే ఒక టీ ఇప్పించారట. (అతని భార్యా పిల్లల సమాచారం వాళ్ళు అడుగలేదు అతను చెప్పలేదు)

"స్టేషన్‌కి అప్పచెప్పండి" అని ఒకరు.

"ఇట్లాంటోళ్ళని ఇరగ తన్నాలి నాయళ్ళని" అని ఇంకోడు.

'మొన్న చలమయ్యగాడి కొట్లో బీడీ దిండు పోయింది ఈ వెధవేనేమో చూడండి' అంటూ మరొకడు.

ప్రక్కనున్నతని దగ్గర బీడీ ఒకటి తీసుకొని కాల్చుకుంటున్నాడు పోలీసు. అన్నీ వింటున్నాడు. (చూస్తున్నాడు కూడ)

"అయ్యా నేనెరగను బాబూ", "వన్నొదిలెయ్యండి బాబూ", కూటికి లేక చేశాను బాబూ, వన్నొదిలెయ్యండి బాబూ, "మీ కాళ్ళకి మొక్కుతాను బాబూ", అంటూ లేని మనిషి సత్యం కాళ్ళకి మొక్కటానికి వొంగబోయాడు. సత్యం వెనక్కితగ్గి "ఛూ—లంజాకొడకా, నాకెందుకురా మా వదిన కాళ్ళ మీదపడు" అంటూ వాడి వెనకాలేవున్న వదిన్ని చూపించాడు. వాడు వెనక్కి తిరిగి వెంకాయమ్మ కాళ్ళు గట్టిగా పట్టుకున్నాడు.

"ఏయ్. ఏం తమాషాగా వుందా. ఆడ్ని తన్నటం, వదిలెయ్యటం, ఏం తథ? ఆ" అంటూ పోలీసు సత్యం వంక చూస్తూ గుంపు మధ్యలోకి వచ్చాడు. పట్టుకున్న కుర్రాళ్ళు చాలా విచిత్రంగా చూస్తున్నారు.

"ఆ ఏవిరా నీ పేరు" పోలీసువాంకారంతోనే అ గాడు

"రసూల్" దయనీయంగా చెప్పాడు లేని మనిషి.

"ఓరి సాయిబ్బు నా కొడకా. ఏం రోగం నీకు".

"ఏదో ఆకలేసి తప్పు చేశాను సామీ, ఈ సారికి వదిలెయ్యండి". అతి దీనంగా వేడుకున్నాడు.

"ఆ" అని నిట్టూర్పు విడిచి "ఏయ్ మీరంతా ఎందుకిక్కడ పొండి" అంటూ గర్జించాడు పోలీసు. "ఆ పొండి పొండి" అంటూ సత్యం గుంపుని పంపించేశాడు.

ముగ్గురు కుర్రాళ్ళు తాము వదిలి వచ్చిన అన్నం దగ్గరకు వెళ్ళారు. ఇస్తరాకు ముక్కలు ముక్కలయింది. అక్కడక్కడ అన్నం మెతుకులు దుమ్ములో కలిసి పోయాయి. కనబడుతున్న మెతుకుల్ని ఇంకా కుక్క నాకుతోంది. పంది అక్కడ లేదు. ఆవు దూరంగా వెళ్ళిపోతుంది. మళ్ళా హోటలు వాళ్ళు ఇస్తరాకులు ఇసిరి వేసే వరకు వుండాలి గాబట్టి ఆ కుర్రాళ్ళు మళ్ళా దొంగను పట్టుకున్న చోటకే వచ్చిచేరారు. మిగిలిందల్లా కొద్ది దూరంలో కుర్రాళ్ళు—పోలీసు—వెంకాయమ్మ—సత్యం.

"ఏరా తన్నారా వీడ్ని" సత్యం వైపుకు తిరిగి అడిగాడు పోలీసు.

"అవును సామీ, లంజకొడుకుని చంపేసి వుండేవాళ్ళం మీర్రాకపోతే" అన్నాడు ఉద్రేకంగా సత్యం.

పోలీసు తన పుస్తకంలో ఏదో వ్రాస్తునట్టు నటిస్తున్నాడు.

"అయితే స్టేషన్‌కి పదండి అందరూ" పోలీసు తన బండగొంతుతో అన్నాడు.

"మేమెందుకు సామీ" వెంకాయమ్మ సత్యం నోర్లు తెరచుకొని మరల మూసుకున్నాయి.

"ఎందుకేంటి వాడ్ని కొట్టినందుకు" అన్నాడు పోలీసు.

"సామి సామీ। ఏదన్నా ఇచ్చుకుంటాంగాని మమ్మల్ని వదిలెయ్యండి" అంటూ ఇద్దరూ పోలీసు చేతులు పట్టుకున్నారు.

"ఎంతిస్తారేంటి" అంటూ గంభీరంగా ఇద్దరి వంకా చూశాడు.

"వుందంతా యిస్తాను" అంటూ వెంకాయమ్మ తన బొడ్లోవున్న డబ్బుల సంచినుండి ఆ రోజు ఆ బైమ్‌కి వచ్చిన రెండురూపాయలని పోలీసు చేతిలో పెట్టింది. రోడ్డువంక చూస్తూ అవి తీసుకొని టోపీతీసి చేతిలోవి తలమీద పెట్టుకొని మళ్ళా టోపీ పెట్టుకున్నాడు.

"స్టేషన్‌కి రండి కేసు రాసుకున్న తరవాత మీరు పోదురుగాని. ఆ పదరా స్టేషన్‌కి" అంటూ బయలు దేరాడు పోలీసు స్టేషన్‌కి. అవినీతి వెంట అజ్ఞానం, అమా

యకత్వం వెళ్తున్నట్టు పోలీసు వెంట వాళ్ళు ముగ్గురూ వెళ్తున్నారు.

ఆ పాడుబడిన, నాచిన, ప్రహరీగోడ దగ్గర కెళ్ళేసరికి ఒక రాయి క్రింద పడింది. ముగ్గురూ ఆ గోడవైపే తదేకంగా చూస్తున్నారు. అస్పష్టంగా ఏదో ఆ గోడ మీద ఎర్రటి అక్షరాలతో వ్రాసివుంది. వాళ్ళు చూస్తున్నారు. కాని అది చదవలేదు. అది అర్థంగాలేదు. "ఆకలితో చచ్చేకన్నా పోరాటంలో మరణించడం మేలు" ఈ మాటలే ఆ గోడమీద వున్నవి.

---

## అభ్యుదయ పథంలో ఆంధ్ర ప్రదేశ్

భారత దేశంలోని రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ అక్షర క్రమంలో మొదటిది. అలాగే అనేక అభివృద్ధి రంగాలలో కూడా ఆంధ్రప్రదేశ్ అగ్రగామిగా వుంది.

భాషా ప్రాతిపదికతో ఏర్పడిన తొలి రాష్ట్రం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రమే.

పంచాయతీ రాజ్య వ్యవస్థకు తొలి రూపు రేఖలు దిద్దిన ఘనతకూడా ఆంధ్ర ప్రదేశ్ దే.

దేశం మొత్తం మీద ఆంధ్రప్రదేశ్ విస్తీర్ణంలో అయిదవది, జనాభాలో నాల్గవది.

కృష్ణా గోదావరి జీవనది జలాలూ, అపారమైన ఖనిజసంపదా కలిగిన ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం ఏర్పడి పదమూడేండ్లు అయింది.

ఆంధ్రప్రదేశ్ ప్రధానంగా వ్యవసాయ రాష్ట్రం.

భవిష్యత్తుమీద ప్రగాఢమైన విశ్వాసంతో పరిశ్రమల రంగంలో కూడా ఆంధ్ర ప్రదేశ్ ముందంజ వేస్తున్నది.

హైదరాబాదు నగరమూ, పరిసర ప్రాంతాలు, విశాఖపట్నం, రామగుండం, కొత్తగూడెం ప్రాంతాలలోని పారిశ్రామిక వాతావరణం కొత్త కొత్త పరిశ్రమలకు ఆకర్షణీయంగా అభివృద్ధి చెందుతున్నది.

విదేశీయుల పరిపాలనలో తెలుగు ప్రజల ఐక్యత విచ్ఛిన్నమైంది.

ఒకే భాష, ఒకే లక్ష్యం, ఒకే భవితవ్యం—అనే ఆదర్శాలు నాలుగుకోట్ల తెలుగు ప్రజలు విస్తృత ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రంలో ఐక్యంగా వుండడం శ్రేయస్కరమని ఉద్బోధిస్తున్నాయి.

రాష్ట్రంలో లభించే వనరులను ఎక్కువగా ఉపయోగించుకోడానికి రాష్ట్రంలోని వివిధ ప్రాంతాల ప్రజలు వారి ప్రయోజనాలను సమంగా పొందటానికి, ఒకరికొకరు చేదోడు వాదోడుగా సమన్వయ పూర్వకమైన అభివృద్ధి సాధించడానికి—అన్ని ప్రాంతాలు ఐక్యంగా వుండడం అవసరం.

---

# కుటుంబరావుతో ఇంటర్వ్యూ

— నవీన్

1. ప్ర. మీకు మొట్టమొదటి సారిగా కథలు రాయాలన్న కోరిక ఎప్పుడు కలిగింది? ఈ కోరిక కలగటానికి మిమ్మల్ని బాగా కదిలించిన బాహ్యసంఘటన యేదన్నా కారణమా? ఆ సంఘటనను గూర్చి వివరిస్తారా?

1. జ. కథలు రాయాలన్నకోరిక అందరికీ కలుగుతుందనే అనుకుంటాను. నాకు చిన్నతనంలోనే కలిగింది. 'సాహితి' లో మా అన్నగారు (కొడవటిగంటి వెంకటసుబ్బయ్య) రాసిన 'సుకుమారి', 'ఏప్రిల్ ఫూల్' వగైరా కథలూ, చింతా దీక్షితులు గారి 'సాహితికి కథ' మొదలైన కథలు నా పదో ఏటనే చదివాను. అట్లా కథలు రాయాలన్న ఉబలాటం ఉండేది.

2. ప్ర. రచయితగా మీలో కొంత Maturity వచ్చాక మీరు రాసిన ముఖ్య రచన యేది? ఆ రచన ఏ పత్రికలో అచ్చయింది? ఆ రచనకు పాఠకుల నుంచి గాని, విమర్శకుల నుండిగాని ఎలాంటి response వచ్చింది?

2. జ. రచయితగా ఫలాని ఘడియనుంచీ నేను మెచూర్ అయానన్న భావం నాకు ఎప్పుడూ కలగలేదు. వొకరకమైన immaturity రచనకు ప్రోత్సాహమిస్తుందని నేననుకుంటున్నాను. "Mature అయినాను" అన్న భావం కలిగాక ఎవరూ కథలు రాయ లేరేమో.

3. ప్ర. మీ early stages లో రచయితగా మిమ్మల్ని బాగా ప్రోత్సహించిన వ్యక్తులెవరు? అలాగే మొదట్లో మీ రచనల్ని ప్రచురించి ప్రోత్సహించిన ఆ నాటి పత్రికలేవి?

3. జ. నేను అట్టే ఇతరుల ప్రోత్సాహం మీద ఆధారపడలేదు. కాని ఆంధ్ర శేషగిరిరావుగారు నా కథల పట్ల ఆదిలో ఆసక్తి చూపకపోతే బహుశా నేను కథలు రాసినా, ప్రచురించి ఉండను.

4. ప్ర. మొదట్లో మిమ్మల్ని బాగా influence చేసిన తెలుగు రచయిత లెవరు? Non-Telugu రచయిత లెవరు?

4. జ. Influence మాట చెప్పటం కష్టం. కాని నేను ఆసక్తితో

చదివిన కథలు చింతా దీక్షితులుగారివీ, శ్రీనివాస శిరోమణిగారివీ, మునిమాణిక్యం వారివీనూ. చలంగారి కథలు రాయటం మొదలు పెట్టాకనే చదివాను. ఆ నాటి పత్రికలు చాలా వరకు నన్ను కథల కోసం వేధించాయి. దాన్ని encourage చెయ్యటమంటే అనండి. నాకు అభ్యంతరం లేదు.

5. ప్ర. మీ early stages లో మీరు మీకిష్టమైన యే రచయితనన్నా conscious గా అనుకరించటానికి ప్రయత్నించారా?

5. జ. నాకు తెలిసి నేను యే రచయితనూ అనుకరించలేదు.

6. ప్ర. సాధారణంగా మీరు రోజూ యే సమయాల్లో రాస్తుంటారు? వొక నియమిత సమయంలో అయితేనే రాయగలరా? లేక సమయాన్ని గురించి యే పట్టింపులూ లేవా?

6. జ. రచనలు విరివిగా చేసే కాలంలో రాత్రి మేలుకుని రాసేవాణ్ణి. ఇప్పుడు రాయటం చాలా తక్కువ. యేదన్నా రాయాలంటే ఉదయమూ, సాయంకాలమూ రాస్తాను. రాత ఇతర పనులకు అడ్డం రాకుండా చూసుకుంటాను.

7. ప్ర. రచయితకు 'mood' వస్తేనే బాగా రాయగలడని చాలామంది అనుకుంటారు. మీరుకూడా 'mood' వస్తేనే బాగా రాయగలరా?

7. జ. Mood అంటే యేమిటో నాకు తెలీదు. అగత్యం యేర్పడితే రాస్తాను. అగత్యం అన్నది యే కారణం చేతనన్నా యేర్పడవచ్చు. Mood వస్తేనేగాని రాయని వాళ్ళు కళాకారులై ఉంటారు. నేను కళాకారుణ్ణని పొరపాటున కూడా అనుకోలేదు.

8. ప్ర. మీరు ఎన్నో నవలలు, కథలు రాసారు. అవన్నీ మీరు serious గానే రాసారా? లేక పత్రికలవాళ్ళ బాధ పడలేకనో, లేక మరే ఇతర కారణాల వల్లనో రాసినవి యేవైనా ఉన్నాయా?

8. జ. పత్రికల వాళ్ళ (బాధ అనను) వొత్తిడివల్ల రాసినా సీరియస్‌గానే రాశాను. ఆషామాషీకి ఎన్నడూ రాయలేదు. నేను రాసిన వాటిలో Occasionకు (జర్నలిస్టుగా) రాసిన కథలు కూడా ఉన్నాయి.

9. ప్ర. "చదువు" తప్ప మీరు రాసిన నవలలన్నీ సైజును బట్టి చిన్న నవలలే. చిన్న నవలలంటే మీకు ప్రత్యేకమైన అభిమానం ఉందనుకుంటాను. కాని వివిధ సమస్యల్నీ, సంఘర్షణల్నీ, వివిధ మానసిక ప్రవృత్తుల్నీ విశదంగా విస్తృతంగా

(comprehensive) చిత్రించే అవకాశం లేదనుకుంటాను. అందువల్ల చిన్న నవల శాశ్వతంగా నిలిచే గొప్ప నవల ఎప్పుడూ కాలేదు అనే అభిప్రాయంతో మీరు ఏకీభవిస్తారా? ప్రపంచ సాహిత్యంలోని యేగొప్ప నవలైనా తీసుకోండి. అది పెద్ద నవలై ఉంటుంది.

9. జ. నేను "చిన్నసైజు" నవలయితనే minimum రాయాలనీ, పాఠకుడి టైమ్ వీలయినంత తక్కువగా ఖర్చు చెయ్యాలనీ, నా తెలివితేటలూ, "గొప్పతనమూ" పాఠకుడిమీద రుద్దరాదనీ నా ఉద్దేశం. "చదువు" పెరిగి పోవటానికి కారణం అదంతా ఒక్కసారిగా రాయక పోవటమే; నెలకు రెండు సెషన్లు రాస్తూపోయాను.

ఏ నవలా కారుడూ సమాజంలోని అన్ని సమస్యలను గురించీ రాయలేడు. రాస్తాననుకుంటే ఆత్మవంచన చేసుకుంటున్నాడన్నమాట. ఏ నవలా శాశ్వతంగా నిలవదు. ఈజిప్టు రాజుల శవాలల్లే కృత్రిమంగా నిలిపి ఉంచినా వాటివల్ల ప్రయోజనం లేదు. నేను ఏది రాసినా పాఠకులు ఒకసారి చదివి అవతల పారేస్తారనే నమ్మకంతోనే రాశాను. అవన్నీ శాశ్వతంగా నిలవాలనీ నిలిచి ఎవరినో ఉద్ధరిస్తాయనీ నేను ఈ నాడుకూడా అనుకోవటంలేదు. ఏ రచననుంచి అయినా మెదడు absorb చేసుకోదగినది చాలా కొంచెం ఉంటుంది. దాన్ని పదిసార్లు చదివి ఎక్కువ లాభం పొందేదేమీ ఉండదు. ప్రపంచ సాహిత్యంలోని "బండలు" ఊడబొడిచాయని అనుకోవటం లేదు.

10. ప్ర. మీరు రాసిన నవలల్లో, మీదృష్టిలో గొప్పనవల యేది? ఆ నవలను మీరు గొప్పనవల అనుకోటానికి కారణాలేమిటి?

10. జ. నేను రాసిన నవలలన్నీ ఒకే తరగతివి. పరిమిత ప్రయోజనాలు గలవి. అందులో ఒకటి గొప్పదీ, ఒకటి తక్కువదీ అనేది ఇతరులను బాధించాలి గాని నన్ను కాదు. అడగని వాళ్ళకి పాపంగా చెబుతున్నాను—నా రచనలు నేను చదవను.

11. ప్ర. మీరు Marxist అని మీరే వొకచోట చెప్పుకున్నారు. తెలుగు దేశంలో కూడా మీరు Marxist అనే image ఉంది. కాని మీ నవలల్లో ఎక్కడా మీరు Marxism ను చిత్రించినట్టు కన్పించదు. శ్రీశ్రీ లోనో, రాచకొండ లోనో వాళ్ళ Marxist దృక్పథం కొట్టవచ్చినట్టు కన్పిస్తుంది. అంటే మీరు మీ Marxist దృక్పథాన్ని మీ రచనల్లో ప్రతిబింబించకుండా కావాలనే avoid చేసారా? రచయిత వొక "ఇజమ్"కు పూర్తిగా commit అయిపోయినప్పుడు, కళాకారుడుగా తను తీసుకున్న వస్తువుకు శిల్పం దృష్ట్యా న్యాయం చేకూర్చ లేక పోతాడని మీరు నమ్ముతారా?

11. జ. నా రచనలు క్రిటికల్‌గా చదివే వాళ్ళకి నేను Marxist ను అని అర్థం కావాలి. కాకపోతే నాలో Marxism జీర్ణం కాలేదన్నమాట. Marxism ను నిరూపించటానికి నేను రాయలేదు. జీవితాన్ని గురించే రాశాను. Marxism కు 'Commit' కావటం అంటే ఏమిటి? ఏ ఇజమునన్నా ప్రచారం చెయ్యటానికే రచనలు చేసేవాడు నేల విడిచి సాము చెయ్యక తప్పదేమో.

12. ప్ర. ఇటీవల వారపత్రిక మీ "తార" అన్న నవలను సమీక్షిస్తూ ఇట్లా రాసింది:

"తెలుగు దేశాన్ని ఏనాడో విడిచిపెట్టి మద్రాసులో స్థిరపడిన శ్రీ కుటుంబరావు ఇటీవలి నవలికలలోని పాత్రలు ప్రధానంగా ఊహాజనితాలుగా ఉంటున్నవితప్ప సమాజ పరిశీలన ద్వారా ఉద్భూతమైనవిగా కానరావటం లేదు. పైగా వితంతు సాహిత్యంగా భాసిస్తోంది. బాలవితంతువో, వృద్ధవితంతువో వారి ఇటీవలి నవలల్లో ప్రముఖపాత్ర వహిస్తోంది....అందరికీ చిట్టచివరకి ఏదోవిధంగా మద్రాసుతోటీ, సినిమా పరిశ్రమతోటీ సంబంధం ఉండక తప్పలేదు."

ఈ విమర్శను గూర్చి మీరేమైనా చెప్పగలరా?

12. జ. "తార" విమర్శకుడు రాసినదంతా నిజమే. నేను తెలుగు దేశం విడిచిపెట్టి 30 ఏళ్ళు కావస్తున్నది, తమిళ జీవితం నాకు తెలీదు. నా పాత్రలను మద్రాసు వాతావరణంలోనే ఉంచవలసి వస్తున్నది, నాకు తెలీని విషయాలను గురించి రాయనందుకు ఆ విమర్శకుడు తప్పు పట్టితే అందుకు నేనేమీ చెయ్యలేను. నాది "వితంతు" (వెధవ) సాహిత్యం అని అనాలని ఆ విమర్శకుడికి దురదగా ఉంటే నేను అభ్యంతరం చెప్పను. నా రచనలలో ఏ శాతం వితంతు సాహిత్యమో ఆయన లెక్కలు ఇచ్చిఉంటే బాగుండేది. అదీగాక "వితంతు" సాహిత్యం గురించి ఆయన ఈసడింపుగా మాట్లాడటం నా రచనను ఈసడించటానికైతే ఫరవాలేదుగాని అది భారతానికే తగులుతున్నది. ఎందుకంటే, పాపం, కౌరవపాండవుల మూలపురుషులే "వెధవముండాకొడుకులు", "కన్యాశుల్కం"లో ముగ్గురు వితంతువులు (పూటకూళ్ళమ్మ, బుచ్చమ్మ, మీనాక్షి) ఉన్నారు. నేపథ్యంలో ఇంకో అచ్చెమ్మ అనే వితంతువు కూడా ఉన్నది. మిగిలిన ఇద్దరు స్త్రీ పాత్రల్లో ఒకతె వేశ్య. అయినా "కన్యాశుల్కం" వితంతు సాహిత్యం అని ఆ అజ్ఞాత విమర్శకుడు అనగలుగుతాడనుకోను, ఆయన గురజాడవారి మీద ఈగ వాలితే యమబాధ పడిపోతాడని వినికిడి. మద్రాసులో ఉంటూ సినిమాతో సంబంధం లేని ఆంధ్రులు బహుకొద్ది మంది. నాకు ఆ పరిశ్రమతో అంతో ఇంతో సంబంధం ఉన్నది. దానిక్కూడా తప్పు పడితే నాకు తెలిసినది తప్ప నేనేదన్నా రాయవచ్చునన్నమాటా?.

13. ప్ర. మీరు సృష్టించిన పాత్రల్లో వైవిధ్యం లేదనే విమర్శ కూడా ఉంది. మీ పాత్రలు—ముఖ్యంగా పురుష పాత్రలు—మీ గొంతుతోనే మాట్లాడుతాయని కొందరు రాసారు. ఈ విమర్శకు మీ జవాబేమిటి?

13. జ. నేను పాత్రలకిచ్చినంత స్వేచ్ఛ కొందరు ప్రసిద్ధ రచయితలే ఇవ్వరని నేననుకుంటాను. నా పాత్రలు నా గొంతుతో మాట్లాడేదీ లేనిదీ నా గొంతు ఎరిగిన వాళ్ళు చెప్పటం సబబు. పాత్రలలో వైవిధ్యం లేకపోతే అది నా అసమర్థతే.

14. ప్ర. మీ నవలల్లోగాని, కథల్లోగాని వస్తువు మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబాల్లోని ఆర్థిక, సాంఘిక, రాజకీయ వాతావరణం. Marxist అయ్యుండీ కూడా శ్రమ జీవులను గూర్చి మీరు రాసింది చాలా తక్కువ. ఇందుకు కారణం మీకు శ్రమజీవులతో ప్రత్యక్ష సంబంధం లేకపోవటమేనా? తను రాసున్న ప్రజల మధ్య రచయిత స్వయంగా కొంతకాలం జీవించి, వాళ్ళని బాగా అర్థంచేసుకుంటేనే తప్ప వాళ్ళనుగూర్చి రాసే అర్హత ఆ రచయిత సంపాదించలేడు అనే భావాన్ని మీరు అంగీకరిస్తారా?

14. జ. శ్రామికులతో నాకు కొంత సంబంధం ఉన్నది. నేను Factories లో ఫోర్‌మన్‌గా పని చేసిన వాణ్ణి. నాకింద పని చేసిన వాళ్లు నన్ను చూసి గర్వపడిన సందర్భాలు కూడా ఉన్నాయి. వాళ్ళను గురించి చాలా తక్కువే రాశాను. దానికి కారణం వాళ్ళపట్ల నాకున్న అభిమానం. వాళ్ళను Patronize చేస్తూగాని, వాళ్ళని వుద్ధరించటానికిగాని రాయాలంటే చెయ్యి ఆడదు. ప్రకృతి అంటే కూడా నాకు చాలా ఇష్టం. నా ఇష్టాన్ని మాటల్లో పెట్టాలంటే modesty అడ్డం వస్తుంది, అందుచేత ప్రకృతి వర్ణనల జోలికి పోను. నిజమైన కళాకారుడికి ఇలాంటి inhibition ఉండదేమో. రచయిత శ్రామికుడుగా జీవిస్తే తప్ప శ్రామికులను గురించి—అదీ తాను గ్రహించిన మటుకే—రాయాలి. వారిమధ్య కొంత కాలం ఉండి ఆ అనుభవాలను యథాతథంగా దించి, సోమర్‌సెట్‌మామ్‌లాగా పుస్తకాలు డబ్బు కోసం రాయటం నా దృష్టిలో చాలా హేయం.

15. ప్ర. "తెలుగు నవల" ఒక ఉద్యమంగా ఎన్నడూ సాగలేదు. తెలుగు సాహిత్యంలో యే ఉద్యమం వచ్చినా, యే నూతన ప్రయోగాలు వచ్చినా అవి కవిత్వంలోనే వచ్చాయి. మీ దృష్టిలో ఇందుకు కారణాలేమిటి?

15. జ. నూతన ప్రయోగాల ఆశయం ఏమిటో నాకు తెలీదు.

16. ప్ర. 'Stream of Consciousness Novel' గూర్చి మీ అభిప్రాయ మేమిటి? ఇలాంటి నూతన ప్రక్రియలూ, ప్రయోగాలు (new techniques & experiments) తెలుగులోకి వస్తే తెలుగు నవల ఇంకా అభివృద్ధి చెందుతుందని మీరు భావిస్తారా?

16. జ. Stream of Consciousness నవలలు నిరుపయోగం అభాసం. మన మనసు ఎలా నడుస్తున్నదీ తెలుసుకోవటానికి ప్రయత్నించిన క్షణంలో stream తెగిపోతుంది. "You can't observe nature without changing it' అన్నది mental process కు అక్షరాలా వర్తిస్తుంది. అందుచేత ఒక పాత్ర యొక్క భావ ప్రవంతిని మనం ఊహించి కల్పన చెయ్యవలసిందేగాని, అందులో realism నూటికి నూరుపాళ్ళ సాధించటం సాధ్యంకాదు. అయినప్పటికీ భావప్రవంతిని పరిమితంగా నవలారచనలో వాడటంలో కొంత సౌలభ్యం తప్పకఉన్నది.

17. ప్ర. ఈ రోజుల్లో అసంఖ్యాకంగా వెలువడుతున్న నవలల్నిగూర్చి స్థూలంగా మీ అభిప్రాయం యేమిటి? ఇన్ని నవలలు పుట్టుకురావటం మంచికేనంటారా?

17, జ. పదిమంది చదివే నవలలు ఒక విధంగా సార్థకమైనవి, పదిరాళ్లు తెచ్చే నవలలు మరోవిధంగా సార్థకమైనవి, పది పత్రికలను పోషించే నవలలు ఇంకో విధంగా సార్థకమైనవి. ఎవరూ చదవని నవలలే దండుగ. అందరి అభిరుచులూ నావాటిలాగే వుండాలనిగాని, నాకు బాగాలేని రచనలను యితరులు చదివి ఆనందించ రాదనిగాని అనటానికి నాకేమి అర్హత ఉన్నది?

18. ప్ర. పాశ్చాత్య దేశాల్లో ఈ మధ్య నవల పట్ల ఆదరణ చాలాతగ్గిపోయిందంటున్నారు- చాలామంది పాఠకులు నవలల్ని అసలు చదవటంలేదనీ, non-fiction నే యెక్కువ చదువుతున్నారనీ, ముందుముందు ఈ నవలఅనేది పూర్తిగా అంతరించిపోవచ్చుననీ ఆమధ్య 'Encounter' లో ఒక విమర్శకుడు రాసాడు. ఈ విషయాన్నిగూర్చి మీ అభిప్రాయం యేమిటి?

18. జ. ఈ మాట నేను ఇంగ్లీషు పత్రికలలో కూడా చదివాను-(Encounter లో కాదు). అయితే నవల అంతరించిపోతుందని నేననుకోను. జీవితాన్ని విస్తృతంగా చిత్రించటానికి నవలను మించిన సాధనం యేమున్నది? వాస్తవికతతో కూడిన నవలలు మన స్వీయానుభవాన్ని యెన్నోరెట్లు పెంచుతాయి. Non-fiction ఈ పని చెయ్యలేదు.

19. ప్ర. నవలాకారులుగా ఈ క్రింది తెలుగు రచయితలనుగూర్చి మీ అంచనా యేమిటి?

ఎ) ఉన్నవ లక్ష్మీనారాయణ, బి) విశ్వనాథ సత్యనారాయణ,
సి) అడివి బాపిరాజు, డి) గుడిపాటి వెంకటచలం,
ఇ) గోపీచంద్, ఎఫ్) బుచ్చిబాబు.
జి) ఆర్. ఎస్. సుదర్శనం, హెచ్) రా. వి. శాస్త్రి.

19. జ. ఎ) ఉన్నవ లక్ష్మీనారాయణగారి "మాలపల్లి"లో ప్రశంసించదగినది ఎంతైనా వున్నది. దానిమీద నేను ఒకసారి రేడియో ప్రసంగంచేస్తే, ఆ నవలను ఏడెనిమిదిసార్లు చదివిన ఒక పెద్దమనిషి "నువు చెప్పిన పాయింట్లలో ఒకటీ నేనుగమనించలేదు" అన్నారు. చదవటంలో తేడాలుంటాయి.

బి) విశ్వనాథ సత్యనారాయణగారి నవలలు నేను చాలాభాగం చదవలేదు. సమకాలీన జీవితాన్ని అర్థంచేసుకోవటానికి అవి పనికిరావని నా అనుమానం. కాని ఆయనకు నవలను "నిర్మించట"లో ఉన్న శ్రద్ధ చాలామంది నవలాకారులలో కనబడదు.

సి) అడివి బాపిరాజుగారి నవలలు నేను అసలే చదవలేదు. ఏకారణం చేతనో అవి నాకు అందలేదు.

డి) గుడిపాటి వెంకటచలంగారి నవలలు నవలలుగాకన్న వ్యాసాలుగా యెక్కువ ఉపయోగకరం. మరొకరైతే వ్యాసాలు రాసిఉండే విషయాలనుగురించి ఆయన నవలలు రాశారు. మ్యూజింగ్స్ తరువాత రాసితప్పుదిద్దుకున్నారనుకోండి. ఆయన కథలుమాత్రం సిసిందీలు

ఇ) గోపీచందుగారి నవలలుకూడా నేనంత శ్రద్ధగా చదవలేదు. ఒక నవల చదవలేకపోవటంకూడా జరిగింది. కాని ఆయన తన అనుభవాన్ని యథాతథంగా నవలలలో పెట్టినట్టు కనబడుతుంది కథలు కొన్ని చాలామంచివి.

ఎఫ్) బుచ్చిబాబు దృక్పథం నాకు "విలాయితీ"గా కనబడుతుంది.

జి) సుదర్శనంగారి ఒక నవలా, ఒక కథలపుస్తకమూ చదివాను. కొన్ని కథలూ, నవలలో కొన్ని సన్నివేశాలూ చాలాగొప్పగా వున్నాయి. ఆయన విమర్శలు చదువుతుంటే చిన్న కామెరాకు మూరెడు లెన్సు తగిలించినట్టుంటుంది.

హెచ్) రా. వి. శాస్త్రిగారి 'అల్పజీవి' చదివాను. అది ఆయన రచనలకు టిపికల్‌గాలేదు. ఆయనను Master of Monologue అంటాను. ఆ మాస్టరీ ఆయన కథలలోనూ, నాటకం (నిజం) లోనూ, అల్పజీవిలోనూకూడాస్పష్టంగా కనబడుతుంది. వచనం రాసేవాళ్లలో ఆయన నికరమైన కవి.

20. ప్ర. నవలాకారులుగా కంటె కథకులుగానే మీరు ఎక్కువ విజయాన్ని సాధించారంటే ఒప్పుకుంటారా?

20. జ. నాకు తెలీదు. మీరు చెప్పండి, నేను వింటాను.

21. ప్ర. మీరు రాసిన కథల్లో మీకు నచ్చిన కథల్ని.... లేదా మీకు ఎక్కువ సంతృప్తిని కల్గించిన కథన్నిగూర్చి చెబుతారా?

21. జ. చెప్పను. అది యెవరికీ ఉపకరించదు. చదివేవారి అభిప్రాయాలూ, నావీ ఒకరకంగా ఉండకపోవటం నేను గమనించాను.

22. ప్ర. మీ దృష్టిలో గొప్ప కథకుడి ముఖ్య లక్షణమేమిటి?

22. జ. గొప్పకథలు రాయటం ఒకటే లక్షణం.

23. ప్ర. మీ దృష్టిలో గొప్ప కథకు లెవరు?

23. జ. చాలా మంది ఉన్నారు. ఇప్పుడు రాస్తున్న వారిలో రా. వి. శాస్త్రి, బీనాదేవి పేర్లను ఖచ్చితంగా చెప్పాలను. చాటుచాటుగా దాక్కునే కాళీపట్నం రామారావుగారు గొప్పకథలు రాస్తున్నారు....కథలు రాయటం మానుకున్న చాసో కథలు చాలా బాగుంటాయి. పాతవాళ్ళ పేర్లు ఇవ్వటంలేదు.

24. ప్ర. ఈనాడు అసంఖ్యాకంగా వస్తున్న కథాసాహిత్యాన్ని గూర్చి మీ అభిప్రాయం?

24. జ. నవలా సాహిత్యం గురించి చెప్పినదే దీనికీ వర్తిస్తుంది.

25. ప్ర. వ్యంగ్య రచనలు చేయటంలో మిమల్ని మించిన వాళ్ళు లేరని నా అభిప్రాయం. (హాకాశంలో హాక్సిడెంట్, పాత్రలు కావాలి మొ॥) ఈ ప్రక్రియను మీరు మీ talent కు తగినంతగా exploit చేసుకోలేదని కూడా నా అభిప్రాయం. మీరేమంటారు?

25. జ. మీరు సూచించే వ్యంగ్య రచనలు (కేయాస్) నా దృష్టిలో తక్కువ రచనలు. దిబ్బల రాజ్యం కథలను గురించి నేను తక్కువగా అనుకోవటం లేదుగాని వాటిని రాసినందుకు నన్ను "క్షమించిన" వారున్నారు.

26. ప్ర. శ్రీశ్రీ మిమ్మల్ని "ఆంధ్రాచెఖోవ్" అన్నాడు. ఈ Compliment ను మీరు స్వీకరిస్తారా?

26. జ. చెఖోవ్ విశ్వసాహిత్యంలో ఒకడే ఉన్నాడనుకుంటున్నాను.

27. ప్ర. నాటకాలు మీరసలే రాయలేదనుకుంటాను. అంత ముఖ్యమైన సాహిత్య ప్రక్రియ వైపు మీ దృష్టి మరల్చక పోవటానికి కారణం?

27. జ. రేడియో నాటకాలు వొక వంద రాసి ఉంటాను. స్టేజినాటకాలు రాద్దామని ఉన్నదిగాని ఆడే ట్రూప్ లేకుండా నాటకాలు రాయటం దండగ.

28. ప్ర. విమర్శ, విమర్శకుడి బాధ్యతలు ఏమిటి?

28. జ. విమర్శయొక్క ఆశయం రచనల మంచిచెడ్డలను సరిగా అంచనా కట్టటమూ. రచనలో నిగూఢంగా ఉండే అందచందాలనూ, లోపాలనూ వ్యక్తం చేయటమూ. ఎవరన్నా ఇంతకన్నా ఏమనుకుంటారో నాకు తెలీదు. ఈ బాధ్యతలు నిర్వర్తించినవాడు సద్విమర్శకుడు.

29. ప్ర. తెలుగులో విమర్శనాసాహిత్యం తగినంతగా రాలేదు అన్న అభిప్రాయాన్ని మీరు అంగీకరిస్తారా?

29. జ. నిజంగా విమర్శించదగిన సాహిత్యంకూడా అంతగా రాలేదేమో?

30. ప్ర. ఈ మధ్య "సంవేదన"లో శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డిగారు రాసిన కొన్ని సమీక్షావ్యాసాల్నిగూర్చి మీ అభిప్రాయం? విమర్శ అంత నిర్దాక్షిణ్యంగా వైయక్తికంగా, క్రూరంగా ఉండటం అవసరమంటారా?

30. జ. విమర్శలో దాక్షిణ్యం ఏమిటిగాని, క్రూరంగానూ, వైయక్తికంగానూ ఉండనవసరం లేదు. రా. రా. గారి విమర్శలతో నేను ఏకీభవించక పోవటం చాలాసార్లు జరిగింది.

31. ప్ర. "దిగంబర కవుల్ని"గూర్చి మీ అభిప్రాయమేమిటి?

31. జ. కవిత్వం గురించి మాట్లాడే అధికారం నాకులేదు. నాకు తెలిసినదల్లా జీవితం గురించి వారికున్న అభిప్రాయాలే నావీనూ.

32. ప్ర. సాహిత్యానికి, రాజకీయాలకు గల సంబంధం ఎలాంటిది? రెండు వేరువేరు రంగాలంటారా? లేక రెండూ ఒకటేనంటారా? రచయిత తనకిష్టమైన రాజకీయ దృక్పథాన్ని తన రచనలో ప్రచారం చెయ్యటం అవసరమంటారా?

32. జ. వేరువేరు రంగాలేగాని ప్రజల దగ్గర కలుస్తాయి. ఒకరంగాన్ని ఒకరంగం బలపరచవచ్చు, ప్రతిఘటించవచ్చు. రచయితకిష్టమైన రాజకీయ దృక్పథం రంగు అతని జీవితాన్ని ఎలాగూ ప్రభావితం చేస్తుంది. రచయిత పనిపెట్టుకొని ప్రచారం చేయనవసరం ఉండదు.

33. ప్ర. సాహిత్యం సమాజ శ్రేయస్సుకు లేక సంఘ సంస్కారానికి దోహదం చేస్తుందని మీరు నమ్ముతారా?

33. జ. నమ్ముతాను. ఏ సమాజం? ఎలాటి సంఘసంస్కారం? అన్నవి ఎవరికివారు తేల్చుకోవాలి.

34. ప్ర. 'అభ్యుదయ సాహిత్యం' అంటే మీ నిర్వచనం ఏమిటి Marxist కానివాడు అభ్యుదయ సాహిత్యాన్ని సృష్టించలేడు అనే వాదనతో మీరు ఏకీభవిస్తారా?

34. జ. "ముందుచూపు" గలది, సాంఘిక పరిణామాన్ని సరిఅయిన మార్గాన ముందుకు తీసుకుపోగలది అభ్యుదయ సాహిత్యం. ఇది general definition. ఈ నాడు Marxism అర్థంకానివాడు జీవితాన్నే అర్థం చేసుకోలేడని నేనను కుంటాను. అభ్యుదయ సాహిత్యం ఏమి రాస్తాడు?

35. ప్ర. ప్రాచీన సాహిత్యానికి, ఆధునిక సాహిత్యానికి ముఖ్యమైన భేదాలేమిటి? తెలుగులో ఆధునికయుగం ఎవరితో, ఎప్పట్నించి ప్రారంభమైందంటారు?

35. జ. ప్రాచీనసాహిత్యం గతంనుంచి మంచిని గ్రహించటానికి ప్రయత్నించింది. జరిగిపోయిన కాలాలనుంచి ప్రజలకు మంచీ, చెడూ చెప్పింది. ఆధునిక సాహిత్యం వర్తమానాన్ని చూస్తూ, భవిష్యత్తుకు పనికివచ్చే మంచిచెడులను వెతుకుతుంది. తెలుగులో ఆధునిక యుగం వీరేశలింగం—గురజాడద్వయంతోనే నిస్సందేహంగా ప్రారంభమయింది.

36. ప్ర. ఫ్రాయిడ్ ప్రభావంవల్ల పాశ్చాత్య సాహిత్యాల్లో Sex ను గూర్చి, Unconscious ను గూర్చి అనేక Perversions ను గూర్చి విరివిగా నవలలు, కథలు, నాటకాలు వచ్చాయి. ఇలాంటి రచనలు తెలుగులో చాలా తక్కువ. తెలుగులోకీ ఇలాంటి రచనలు రావటాన్ని మీరు హర్షిస్తారా? లేక ఫ్రాయిడ్ ప్రభావం వల్ల సాహిత్యానికి మేలుకంటె కీడేఎక్కువ వాటిల్లిందనే వాళ్ళల్లో మీరొకరా?

36. జ. పాశ్చాత్య సాహిత్యాల్లో మానసిక వ్యాధులను కూడా కళావస్తువులుగా స్వీకరించారు. ఆ రకం రచనలు నాకు నిరుపయోగంగా కనబడతాయి. పాశ్చాత్య రచయితలు "వృత్తి" రచయితలు. వారుతమ బతుకుతెరువు కోసం పడ్డ అగచాట్లన్నిటా సాహిత్య ప్రయోజనం ఉంటుందనుకోనవసరం లేదు. రచనల మీద బతకవలసిన వాళ్ళు తెలుగులో రాస్తే ఎవరు మాత్రం ఎట్లా అభ్యంతరం చెప్పగలరు? Market నియమాలను బట్టి సాహిత్యం ప్రచారమైతే దాన్ని ఆపటం ఎవరి తరం?

ఫ్రాయిడ్‌ను తప్పుపట్టే పనిలేదు. అతని తప్పుడు సిద్ధాంతాలను తప్పు పట్టవచ్చు. Marxism లాగే Freudism కూడా మనుషులను మరింత బాగా అర్థం చేసుకునే టందుకు తోడ్పడిందని ఒప్పుకు తీరాలి. Freudism ను commercialise చేసినవారి సాహిత్యాన్ని serious గా తీసుకోనవసరంలేదు.

37. ప్ర "కన్యాశుల్కం" యొక్క గొప్పదనాన్ని తెలుగు వాళ్ళకు వివరించి చెప్పిన వాళ్ళల్లో ఒకరిగా మిమ్మల్ని ప్రశ్న అడుగుతున్నాను. "కన్యాశుల్కం" మీద ఒక ముఖ్యమైన విమర్శ ఉంది:

"కన్యాశుల్కాన్ని" ఇంతవరకూ యే నాటక సంస్థకూడా సంపూర్ణంగా స్టేజి మీద ప్రదర్శించలేకపోయారని, అది స్టేజిమీద ప్రదర్శించటానికి అనువైన నాటకం కాదని, స్టేజిమీద ప్రదర్శనా యోగ్యంకాని నాటకం గొప్పనాటకం కాదని, ఆ విమర్శ యొక్క సారాంశం. ఈ విమర్శకు మీ సమాధానమేమిటి?

37. జ. కన్యాశుల్కాన్ని మొత్తంగా స్టేజిమీద ఆడటం సాధ్యంకాదన్న మాటకు నా అభిప్రాయంకూడా దేనికి? సాధ్యం కాదంటే ప్రదర్శన యోగ్యం కాదని నా అభిప్రాయం కాదు. అందులో ప్రదర్శన యోగ్యంకాని దృశ్యాలేవీలేవు. అది గొప్పనాటకం కాదనే వాళ్ళు భరతుణ్ణి, మమ్మటుణ్ణి సాక్షం తెస్తారని నా అనుమానం అది గొప్పనాటకమేనని నా నమ్మకం.

38. ప్ర. మీ 60 యేళ్ళ జీవితంలో రచయితగా మీరు నేర్చుకున్న కొన్ని ముఖ్య పాఠాల్ని మా పాఠకులతో పంచుకుంటారా?

38. జ. "నా షష్టిపూర్తి" అన్న వ్యాసం ఆంధ్రజ్యోతి వారపత్రిక (14-11-69) సంచికలో నేను నేర్చుకున్న ముఖ్య పాఠాలను గురించి రాశాను.

---

# తిరుగబడు

తిరుగబడు తిరుగబడు తిరుగబడు

అలజడి మా జీవితం, ఆందోళన మా వూపిరి, తిరుగుబాటు మా కర్తవ్యం అని నిజాయితీతో భావిస్తున్న యువకులందరికొరకు మా కోరికపై వరవరరావు, లోచన్, అశోక్, సంజీవరావు, సుధాకర్, కిషన్, యాదగిరిరావు, దర్శన్, ఎక్స్-రే, ఐ—సి రచించిన కార్యక్రమం డిసెంబర్‌లోనే యివ్వబడుతుంది.

వివరాలకు: స్వేచ్ఛాసాహితి, 6-551-3, బ్రాహ్మణవీధి, హనుమకొండ, వరంగల్-1.

---

సృజనాత్మక ప్రకటనలకు సృజన

---

## సృజన ప్రకటన రేట్లు

| | |
|---|---|
| కవర్ పేజి (వెనుక) | రు. 150 |
| ,, ,, (లోపల) | రు. 125 |
| పూర్తి పేజి (సాదా) | రు. 100 |
| సగం పేజి ( ,, ) | రు. 50 |
| పావు పేజి ( ,, ) | రు. 30 |

ప్రత్యేక పంచికలకు, ప్రత్యేక రంగులకు రేట్లు మారవచ్చును.

కాంట్రాక్టు పద్ధతిపై కన్సెషన్ యివ్వబడును.

---

సంవత్సర చందా: నాలుగు రూపాయలు.




వెలువడింది సృజన రెండవ ప్రచురణ

# అంపశయ్య

ప్రయోగాత్మక నవల

## నవీన్

ఆరంభ యవ్వనంలోని యువకుల మనస్తత్వం యిందులో నిర్భయంగా, నిజాయితితో చిత్రించబడింది. తరచుగా superficial గా చిత్రించబడే ఆరంభ యవ్వన మనస్తత్వాన్ని ఇంతస్పష్టంగా, ఇంత అవగాహనతో, ఇంతనిశితంగా, సాహసంతో చిత్రించిన మరో నవల లేదు. ఆరంభయవ్వనం ప్రతివాడి జీవితంలో వొక సంధికాలం. ఈ కాలంలో వొక యువకుని తీవ్రమైన తపన, అశాంతి ముఖ్యంగా లైంగికమయిన అశాంతి, యీ అశాంతికి మన యునివర్సిటీలు, హాస్టల్స్ యెట్లా రంగస్థలాలో యిందులో చిత్రించబడింది. ఈ వయసులోని యీ అశాంతిని నిర్మాణాత్మకమైన కార్యక్రమాల్లోకి మళ్ళించడంలో విశ్వవిద్యాలయాల వైఫల్యాన్ని యీ నవల అద్దంలా చూపుతుంది.

250 పేజీలు ఐదు రూపాయలు.

సృజన చందాదారులకుమాత్రం మూడు రూపాయలే

ప్రతులకు: సృజన, పి. బి. 67, వరంగల్-2; నవీన్, 6-3-117 రామగిరి-నల్లగొండ.

---

మురికి గుంటల జీవితాన్ని మొదటిసారిగా 'వైతరణి' లో ప్రత్యక్షపరిచయంతో చిత్రించిన

## సి. వి. కృష్ణారావు గారి

# మాదీ మీ వూరే

పెత్తందార్లకే తప్ప పేదవాళ్ళకీ దేశంలో బ్రతుకు లేదా అని ఆవేదనతో ప్రశ్నిస్తుంది. సృజన ప్రచురణలో మూడవదిగా యీ సంకలనం యీ డిసెంబరులోనే వెలువడుతుంది.

ఎవరికయినా వెల ఒక రూపాయే. ప్రతులకు: సృజన, P. B. 67, వరంగల్

---

*Printed and Published by Varavararao for* **'Sahithee mithrulu'**